GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు:

డాక్టరు కే. యన్. కేసరి

సంపుటము ౧౯] సెప్టెంబరు 1947 [సంచిక ౯

# గృహలక్ష్మి

### చాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక చాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒక్కప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.




అత్యంతముగా అలసిపో
తున్నావంటే నరముల పటుత్వం తగ్గి
పోతున్నదనిన్ని అందువల్ల నీ శరీర
దార్ఢ్యంభగ్నం కా వుచున్నదనిన్నీ
అర్థం. ప్రకృతి దేవత ప్రసాదించిన
అత్యుత్తమ చికిత్సా ఔషధమున్ను,
బలవర్ధకమున్ను, శాస్త్ర ప్రకారం
తయారు చేయబడినదన్నీ అయిన
ఓంపోనాను సేవించి ఆ అపా
యమునుంచి తప్పించుకొనుడు అది
నీ శరీరపు ప్రతినాళంలోకి, నరంలోకి
కండలోకి క్రొత్త జీవనమును, విస్తా
రం శక్తిని ప్రసాదిస్తుంది. అందు
వల్ల నీ బలము, సామర్థ్యము పదిరెట్లు
హెచ్చును.

ఇంక్వైరీలు: తపాల్ పెట్టె నెం. 250.
మద్రాస్. ప్రధాన కెమిస్టులు,
డ్రగ్గిస్టు లందరివద్దను లభించును.

## ఓంపోనా
టానిక్కు
నరముల బలసమృద్ధము జేయును

# కేశ్ రీన్ తలనూనె




## విక్టోరియా డిపో
నార్త్ మాడా స్ట్రీట్, మైలాపూరు, మద్రాసు (షాపులలోకూడ దొరకును)

## కేశ్ రీన్ షాంపూ పౌడరు
వెల 0-12-0

దీనితో స్నానము చేసిన, తలలోని జిడ్డు, మురికి పోగొట్టి జుత్తును పెంచుటలో సహాయపడును.

పైవాటిలో, ఒకటైననూ, రెండైననూ పోస్టేజి 0-10-0 ప్రత్యేకముగా అగును.

## విక్టోరియా డిపో,
మైలాపూరు మద్రాసు. 4.

## మిత్ర ఫార్మసీ (రిజిష్టర్డు)
తెనాలి.
స్థాపితము 1924

## మిత్రాంజనము (రిజిస్టర్డు)
- నొప్పులకు
- బాధలకు
- కాల్పులకు

దివ్యాంజనము
అన్ని మందుషాపులలోను దొరకును
ఏజంట్లు కావలయును.

Telephone No. 2422
,, 2863—2446

బెంగుళూరులోనా?

Telegrams: 'PLEASURE'

# శాస్త్రీస్ హొటల్‌లో బస చెయ్యండి

హోటల్ బృందావన్, హైగ్రౌండ్స్ హోటల్, రేస్‌కోర్సు యెదుట,
బెంగుళూరులో ఇదే అతి దర్జాయైన గొప్ప హోటలు;

బస చేయదగినది. పేరుకుతగ్గ ప్రాశస్త్యముగల్గది ఇదొక్కటే. ఒకమారు వచ్చి చూడదగినది.



నవీనమయిన అన్ని ఏర్పాట్లతోను, సౌకర్యములతోను అలరారు ఉత్తమ తరగతికి చెందిన గొప్ప వసతిగృహమిది. సువిశాలమయిన, బాగుగా గాలివచ్చునట్టి గదులు, స్నానములకు ప్రత్యేక గదులు, అతి నవీనమగు శానిటరీ ఏర్పాట్లును గలవు.

ఫోన్ 2422

బ్రాంచ్:

శాస్త్రీస్ హోటల్, చిక్‌పేట్, బెంగుళూరు సిటీ.

చాలా మితమయిన రేట్లకు బాగుగా అన్ని సౌకర్యములు అమరియున్న విశాలమయిన గాలిగల గదులు. ఆంధ్రభోజనము ఒక ప్రత్యేక విశేషము.

ఇది చదవండి:

దివాన్ బహదూర్ డి. శ్రీరామశాస్త్రిగారు, ఎమ్. ఎల్, విశాఖపట్టణము, ఇలావ్రాశారు:

గతనెల 22 నుండి 24 వ తేదీవరకు మీబృందావనం హోటలులో బసచేసియుండిన నేనున్నూ మెసానిక్ అతిధులుగ వచ్చిన యితర మిత్రులున్నూ ఇందుమూలముగా మా సంతృప్తిని. సంతోషమును మీకు తెలియపరచుచున్నాము, మేమున్నూ కొద్దిరోజులున్నూ మీనౌకర్లు మాయడల అతిశ్రద్ధ ఆదరణచూపియుండిరి. మా అవసరములన్నింటిని జాగ్రత్తగా అమర్చియుండిరి మా కిచ్చినగదులు పరిశుభ్రముగానుండెను భోజన ఫలహారాదులు సంతుష్టికరముగను రుచ్యముగనుఉండెను. మీహోటలుకు సర్వసౌభాగ్య అభివృద్ధులను కోరెదను.

ఆంధ్రుల నవీన సర్వజనామోదమందిన హోటలు
శాస్త్రీస్ హోటల్, చిక్‌పేట్, బెంగుళూరు సిటీవారి నిర్వహణక్రింద ప్రారంభింపబడినది.

# గృహలక్ష్మి

జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

---

## మహాత్ముని ప్రాయోపవేశ విజయము

ఈ మాసారంభంలో గాంధీ మహాత్ములవారు కలకత్తాలో రేగిన మతకలహాలను పురస్కరించుకొని ప్రాయోపవేశం చేయడమున్నూ, 74 గం॥ లలో, అది విజయవంతమై ఎప్పటివలెనే శుభాంతంగానే పరిణమించడమున్నూ "గృహలక్ష్మి" కెంతో సంతోష దాయకము.

శ్రీ రామచంద్రమూర్తివారు ప్రాయోపవేశ మొనర్చి సముద్రుని ప్రసన్నుని చేసుకున్నారు, సావిత్రి త్రిరాత్రోపవాస వ్రతమాచరించి—యముని చేతులలోనుండి మగనిప్రాణాలు తిరిగీ లభ్యపరచుకొని సుమంగళియై శ్రీమంతురాలైనది. హరివాస రోపవాస దీక్షాదక్షుడైన అంబరీషమహర్షి దూర్వాసునంతటి కోపిష్టిఋషి ఆగ్రహాని కెదురై నిలువగలిగినాడు. దుర్ఘటకార్యతత్పరులైన వారికి ఆర్యధర్మము ఉపవాసవ్రతము విధించినది. ఇస్లాంమతేమును ఉపవాసమునకు ప్రాముఖ్యత నొసగినది. దాదా పన్నిమత ములును ఉపవాస మాహాత్మ్యమును సమ్మతించినవి. అయితే ఆధునికకాలమున ఉపవాస ములనొనర్చి, దీనితోసహా 12 మార్లు తలపెట్టినకార్యమును సిద్ధింపచేసుకొగల్గిన కీర్తి మహాత్మునికొక్కనికే దక్కినది.

భారతదేశమున—మతకలహములు, రక్తపాతములు—చిరకాలముగా జరుగుచున్నవే. ఆంగ్లప్రభుత్వము ఆ అగ్ని ఆరకుండ పోషించినది. మూల్టాన్, కోహాట్, సహారన్‌పూర్, బొంబాయి, కలకత్తా, కాన్పూరు మున్నగు ప్రాంతముల నిట్టివెన్నియోసార్లు జరిగియుండెను. గత ఆగస్టునుండి, నౌఆఖలి, కలకత్తా, బీహారము బొంబాయిమున్నగు ప్రాంతముల విచ్చలవిడిగా సాగుచున్నవి. ఆగస్టులో జరిగిన అల్లరులందు కలకత్తాలో షుహర్వార్ధి కేవల మెరుంగనివాడు కాడని కొందరి గాఢాభిప్రాయము. అట్లయ్యునేడు మహాత్ము డుపవాసము ప్రారంభింపగానే—ఏల అతడు సహా ఎల్లరు చకితులైనారు? ఏల ఇకపై నిట్టివి జరుగనీయమని వాగ్దాన మొనర్చినారు? అందుకై కొందరెందుకు హామీపడినారు? ఉడుకురక్తపు యువకులు తమ చేతిలోనున్న ఆయుధములనెల్ల—తీసుకొనివచ్చి ఈ కృశీభూతాంగుని, ముదుకని, ఉపవాసవ్రతదీక్షితుని పాదపద్మములుకడ ఏల అర్పించినారు? దానికి కారణము కేవలమాయన భోజనముచేయుట లేదేయన్న మోమాటము కాజాలదు. అది ఆయన తపోతేజముయొక్క ఫలితము అని ముమ్మాటికి చెప్పవచ్చును. అదియొక అలౌకిక తేజస్సు. సృష్టి,స్థితి, లయములకు మూలమైన మహావిభూతి, అది.

మేము మూడునెలలనాడు—'నమస్తే బాపూజీ' అన్న ప్రధానవ్యాసమున ఇట్లని వ్రాశియుంటిమి:

> "మరొక్క ప్రమాదమున్నది. పైప్రకటనవల్ల అనివార్యముగ భారతదేశము విభాజ్యము కానున్నది. దానిచే హిందూముస్లిములకు సఖ్యమమరునో, సంఘర్షణమే హెచ్చునో, మహాత్ముడే సంశయించుచున్నాడు. అట్లు హింసాకాండ తిరిగి చెలరేగునేని మహాత్ముడు మరల ప్రాయోపవేశ మొనర్చుట ఖాయమని తోచుచున్నది. ఇప్పటి కాయన ఉపవాసమును 12 సార్లుపూని కృతకృత్యుడైనాడు. అయితే అందుకాయన తపఃఫలముతోపాటు, పతివ్రతా తిలకమగు కస్తూరిబా మాంగళ్య మాహాత్మ్యమును తోడ్పడినవి. నేడది కరవైనది. అట్టి గండకత్తెర సమయమున—అయిదువలెత్తు ఈ హారతులును, మహాత్ముని పరముగా ముక్కోటిదేవతలకు మ్రొక్కు మ్రొక్కులునే. మనలోకారాధ్యునికి శ్రీరామ రక్ష !"

అది అక్షరములా నిజమైనది.

అయితే ఇంతటితో ఈ బెడద తీరినట్లు మేము తలంచుటలేదు. పంజాబున, నిన్న నేడు ఢిల్లీనగరమున, జరుచున్నట్లు వచ్చుచున్న వార్తలు హృదయవిదారకములుగా నున్నవి. ఢిల్లీనగరములో, ప్రయాణీకులను రైల్వే ప్లాటుఫారముమీద నరికివేయుచున్నారనగా

చంగీస్‌ఖాన్‌గాని, మహమ్మద్ గోరీగాని, నాదిర్‌షాగాని తిరిగి బ్రతికి దండెత్తి వచ్చిరా యనిపిస్తున్నది. ఇట—తిరిగీ దౌర్జన్యము తలయెత్తిన అంతులేని ప్రాయోపవేశదీక్ష వహింతునని బంగాళీలకు ఆనబెట్టి, పొగలోనుండి సెగలోనికి పోయినట్లు ఢిల్లీ చేరుకున్నారు. ఈ సత్యాగ్రహ వ్రతనిష్ఠాగరిష్ఠు లేమి తలపెట్టినారో?

ఒక్కటిమాత్రము మా పాఠకురాండ్రను, గృహలక్ష్ముల నర్థించుచున్నాము. వెనుకమే మన్నట్లు - ఆయన తపఃఫలమ్మునకు తోడుగా కస్తూరిబా మాంగళ్య మహత్వము నేడు కరవై యున్నది. ప్రతి పుణ్యాంగనయు నిజసౌభాగ్యమునకై నిరంతరము వ్రతములు సల్పుచుండును. అట్లు సంపాదితమైన పుణ్యఫలము - సహస్రాంశమైన - శత సహస్రాంశమైన, ఒక్కకోటి పురంధ్రీమణులైన-ఆ మహాత్ముని ఆయుఃపరిరక్షణమునకై ధారవోయుచో-మహాత్ముడు - ఎన్ని ప్రాయోపవేశము లొనర్చినను చిరంజీవియే. అంతేకాదు. నేడు పాంచాల భూమిలో చెలరేగిన హత్యాకాండ, దారుణచర్యలు - సమసిపోయి - అనేక పుణ్యవతుల మానప్రాణములతోపాటు వారి మగల ప్రాణములును నిలుచును. మహాత్ముని కేప్రమాదమైన జరిగిననాడు - భారతమాతకే వైధవ్యము సంప్రాప్తించును - లోకమే అంధకార బంధురమగును.

అమంగళము ప్రతి హతమగు గాక.

---

త్రివర్ణ చిత్రవివరణ (చిత్రకారుడు: కే. సి. యస్. పణికర్.)

మాతృహృదయము అమృతభాండము. మాతృప్రేమ సర్వరక్ష. మాతృస్పర్శ పున్నమనాటి వెన్నెల చలువ.

లేతశిశువు మాత ఒడిలోకూర్చుండి మాతృముఖారవిందమున సకలచరాచర ప్రపంచమును గాంచును గాబోలు—పరమాశ్చర్యమున పకపకనవ్వును. అక్కున చేర్చినంతనే—ఆనందపరశమగును గాబోలు—ఆకలిదప్పులనే మరచును.

తల్లి శిశువును ఒడిలోనుంచుకొని లాలించునపుడు లోకాలనే లెక్కింపదు. ఆమెకు తనబిడ్డచుట్టు గీచుకొన్నగిరి కావల ప్రపంచమే లేదు.

మాతా శిశువులొండొరులకొండురులే లోకముగా—తన్మయమున తాదాత్మ్యమునంది—ఆనందించుట చూచిన స్త్రీపురుషులెవ్వరైనను సరే—తిరిగీ తామూ శైశవమునంది—తిరిగీ ఆ మాతృప్రేమామృత సాగరమున నెలబాలుని వోలె నోలలాడనిచ్చగింతురనుటకు సందేహమా?

అందుచేతనే - ఆర్యధర్మమున - మొట్టమొదటి వాక్కు!

"మాతృ దేవోభవ!"

---

# స్త్రీ సమస్యలు

కె. సూర్యకాంతంగారు

●

సోదరి శ్రీమతి కె. సూర్యకాంతం గారు ఉత్సాహంకొద్దీ కొన్ని ప్రశ్నలువేసి వాటిసమాధానాలున్నూ ఆమే తనకు తోచినట్లు వ్రాశిపంపింది. ఈ ప్రశ్నోత్తరాలు స్త్రీలకత్యవసరాలని ఆమె అభిప్రాయం. మా కె అభిప్రాయంలో పొరపాటేమీ కన్పించదు. కావున వీటిని ప్రచురిస్తున్నాము. అయితే—పాఠకురాండ్ర కెవరికైనా ఇందుకు భిన్నంగా తోచేయెడల వ్రాశిపంపవచ్చు; ఔచిత్యమునకుభంగంకానివి ప్రచురిస్తాము. మేము మాత్రం సాక్షీభూతులమై నారీలోకంలో అభిప్రాయాలేప్రకారం అల్లుకుంటున్నాయో, దానిని పాఠకుల కెరుకపరుస్తుంటాము. గృ॥సం

భర్త ఎంత హింసిస్తున్నా పడి ఊరుకోవడం పాతివ్రత్యమా? ఆ సహింపునకు అంతుంటుందా? అలా హింసిస్తున్న భర్తలను భార్యలు ఏంచెయ్యాలి?

పాతివ్రత్యధర్మంలో ఒకరు హింసిస్తుంటే రెండవవారు పడి ఊరుకోవాలని ఉండదు, అది అచారంలోనూ అలవాటులోనూ వచ్చింది. పాతివ్రత్యం భార్యా భర్తల కిరువురుకీ వర్తిస్తుంది. దాన్నే అన్యోన్యత అంటాం. ఒకరి ఊహ లింకోకరర్థం చేసుకుని సరిపుచ్చుకుంటుండాలి. భర్త హింసిస్తుంటే భార్య పడి ఊరుకోడం చేతకానితనం, వేరేదిక్కు లేదన్న నిరాశ. ఎదిరిస్తే నలుగురూ ఏమంటారో నన్న జంకు. దీనికి అంతేమిటి? అలా హింస్తున్న భర్తలను భార్యలు తెలియజెప్పాలి. అంటే "ఏమండోయి! మీకిది తగదు" అని ధర్మపన్నాలు చెప్పడంకాదు. "మా హక్కులు మీరు గమనించడం లేదు." అని కవిత్వంకూడాకాదు. తాము తప్పచేస్తే తప్పుఅని ఒప్పుకోడం. తప్పులేకపోతే తప్పులేదని ఖండితంగాచెప్పి దండించడాని కవసరము లేదని ధైర్యంగాచెప్పాలి. ఇలాచేస్తే భర్తలకి అహంకారం వచ్చి గొడవరావచ్చు. మొదట తల్లిదండ్రులూ, తోడబుట్టినవాళ్ళూ ఆదుకోవాలి కొన్నాళ్లు, తమపిల్లలను. అలా కొన్నిసార్లయి కొంతకాలం గడిచేసరికి సరిఅవుతుంది సంసారం.

## 2

ఒక్కత్తేకూతురు 'బాల' అందాలకుప్ప. బి. ఏ ప్యాసయింది. కాలేజీపిల్లలస్నేహం, చదువూతప్ప ఏమీ తెలియని అమాయకురాలు. దానికి పెళ్లిచెయ్యాలని చూస్తోంది తల్లి. ఏ సంబంధంవచ్చినా ఏదో వంక పెడుతోంది. "పోనీ నీకు నచ్చినవరుడుంటే చెప్పు" అంటే బదులు చెప్పదు. తల్లి ఏంచెయ్యాలి?

బాల అమాయకురాలుగా పైకి కనిపించినా చాలా తెలివైనది. సంఘాన్ని బాగా అర్థంచేసుకుంది. స్వతంత్రభావాలుంటాయి. అయితే వివాహం చేసుకున్నాక విద్యావతులుకూడా పిల్లులలాగ తమభావాల్నీ, ఆదర్శాలనీ, ఆశలనీ చంపుకుని పడిఉండడమూ, కాలుకాలిన పిల్లులలాగ ఏంచెయ్యడానికీ తోచక గంతులెయ్యడమూ చూసి ఏదితోవ? మన ఆదర్శజీవితం ఎలా దొరుకుతుంది? అని ఆలోచిస్తోంది. తల్లి ఆమెనేమీ తన తొందర చూపించి కలవరపెట్టకుండా ఊరుకుంటే కొద్దికాలంలో బాలే నిర్ణయించుకుంటుంది. అప్పుడు వివాహం చెయ్యొచ్చు.

3

మా హైస్కూలులో ఆడపిల్లలం సాహితీ సంఘం స్థాపించేం. అందులో మగపిల్లల్నికూడా చేర్చుకోవాలంటారా?

అక్కర్లేదు. వద్దని చెప్పాలికూడా. విద్యార్థినులను అలుసుగా ఎంచుతూ, హేళనచేసి, స్వార్థాసూయలతో వ్యతిరేకంగా మసులుతున్నారంటే సత్యదూరంకాదు. అది వారి తప్పుకాదు. స్త్రీలకి సంఘంలో తగిన గౌరవంలేకపోవడమే. దీనికితోడు ముందుకొస్తున్న బాలికలను చూస్తే ఏదోలాగుంటుంది వాళ్లకి. ఇలాంటి వాతావరణంలో మీ సాహితీసంఘంలో మొగపిల్లలను చేర్చుకుంటే చక్కటిరచనా, కవిత్వం రాసే వారికేమీ బెంగలేదుకాని, వ్రాద్దామని ప్రయత్నిస్తూ, అధికసంఖ్యలోఉండే సామాన్యులకు ఉత్సాహం పోయేపరిస్థితివస్తుంది అప్పుడప్పుడే,వేనా బడి సమావేశాలలో మీరచనలు విద్యార్థుల ఎదుటచదివి వినిపించి, వారి రచనలు వినుకుంటే ఉభయత్రమంచిది.

4

స్త్రీ ఉద్యోగంచేసి డబ్బుతెస్తేనూ, తల్లిదండ్రులవైపునుంచి ఆస్తివస్తేనూ దానికి ఆర్థికస్వాతంత్ర్యం వస్తుందంటున్నారే. దీనివల్ల దైనికజీవితంలో ఇప్పుడుంటున్నకంటె ఎక్కువ గౌరవంవస్తుందా?

సాధారణంగా చెప్పాలంటే, ఉద్యోగంచేసుకునే భార్య అయితే తనమాట చెల్లకపోతే తనతోవను చూసుకుంటే నయమనే ధోరణిలో ఉంటుందేకాని భర్తను అర్థంచేసుకుని, తన భావాలను అతడికి నచ్చచెప్పి సరిపుచ్చుకోవాలన్న దృష్టితక్కువగా ఉండడానికి సావకాశంఉంది. వాళ్ళకి ఆస్తికూడాఉంటే చెప్పాలా ? అయితే ఉన్నతవిద్య నేర్చని సోదరీమణులకు, విద్యావతులయికూడా జంకుగలవారికీ ఎన్ని ఆస్తులున్నా ఒకటే. "నన్ను వదలిపోతే దీనికి దిక్కేమీ లేదు' దీనికి సానుభూతి ఎవరూ చూపించరు." అని భర్త అనుకుంటున్నంతకాలం, సంఘం ఆ అహంభావాన్ని సమర్థిస్తూ వ్యక్తిత్వంతో కనబడే స్త్రీని చూసి యీసడించే అంతకాలం స్త్రీ తన వ్యక్తిత్వం గమనించుకుని ఆత్మగౌరవంఅంటే "పతివ్రత" అనిపించుకోవడం మాత్రమే కాదని గమనించేవరకూ ఆస్తులూ, ఉద్యోగాలు గౌరవం తేవు సంసారంలో స్త్రీకి.



# శ్రీమతి దిగుమర్తి జానకీబాయిగారు

★

బరంపురంలో దిగుమర్తివారి సంసారము గొప్పసంసారము. శ్రీ వి. వి. గిరిగారి తండ్రి జోగయ్యపంతులుగారును, విశాఖపట్టణవాసులు మల్లిమడుగుల బంగారయ్యపంతులుగారును వారి అల్లుండ్రు. ఈ కుటుంబముల కన్నిటికి దిగుమర్తివారే కుదురు. వీరందరు సంఘసంస్కరణ పరాయణులు. దేశసేవా నిమగ్నులు. దిగుమర్తి హనుమంతరావుగారు తొలుత గోకలే భారతసేవాసంఘమున సభ్యులుగానుండి పిదప గాంధీ అనుచరులైరి. గాంధీ సిద్ధాంతములో 'ఔషధసేవగాక ప్రకృతి చికిత్సయే శ్రేష్ఠము' అన్న సూత్రమును ఆమరణాంతము—అవలంబించిన ఉత్తములు. తానాసూత్రమును ఒకటి రెండుసార్లు భంగపుచ్చినా హనుమంతరావుగారు దీక్షగా నవలంబించిరని గాంధీజీ ప్రశంసించినారు. ఆయన నెల్లూరివద్ద పల్లెపాడు ఆశ్రమ పరిపాలకులుగానుండి 1926 లో చనిపోయిరి. బంగారయ్యపంతులుగారి కుమారులిద్దరు—గాంధీ అనుచరులైరి. గిరిగారి కుటుంబము చెప్పనక్కరలేదు. గిరిగారి సోదరి ఒరిస్సా అస్సెంబ్లీ డెప్యూటీ స్పీకరు. అట్టి పరిసరములలో—బంగారయ్యపంతులుగారికి మనజానకీబాయిగారు కుమార్తెగాజన్మించిరి. హనుమంతరావుగారి సోదరులు శాసనసభ్యులులునగు శ్రీ రామస్వామిగారిని చేబట్టిరి.

ఈమెయు చెన్నపురి క్వీన్ మేరీస్ కళాశాలలో ఇంటరు సీనియర్ చదువుచు మాని వేసి దేశసేవకు గడంగెను. సత్యాగ్రహములలో భర్తతో పాటు పాల్గొనుటచే—రెండు సార్లు—మొత్తము 18 మా॥ల



శిక్షయు జరిమానాయు విధింప బడి చెల్లించి, అనుభవించిరి. ఉప్పుసత్యాగ్రహమున ఈమె నిషేధపు ఉప్పుఅమ్ముచుండగా —పాపారావుగారను తహశీలు దారు అసహ్యాకరముగా ఆమె చేయి మెలిపెట్టి, గుప్పిటిని గిల్లి —ఉప్పు లాగుకొన్నారు. 1932 లో బందరున ఈదంపతులు 144 సె. ఉల్లంఘింపగా భర్తనరెస్టుచేసి, ఈమెను సభనుండి మోచుకొనివచ్చి ఈవల కుదియవేసిరి. ఈ దంపతులు రెండవసారి జైలులోనుండగా—గర్భవతియగు నీమెకు అచ్చటనే (18-8-1932) న ప్రథమ పుత్త్రికా జననమైనది. ఇప్పుడా చిరంజీవిని జూనియర్ ఇంటర్ చదువుచున్నది. 10 సం॥ లనుండి ఆమె హరిజనోద్ధారణ సంఘసభ్యురాలు. 3 సం॥లుగా విశాఖపురపాలక సంఘసభ్యురాలు. వీరి అగ్రసోదరులు కోదండరామస్వామిగారు అ. భా. చ. సంఘ ఆంధ్రశాఖకు వ్యవహార కార్యదర్శిగారు. మరొకరు జగన్నాథరావుగారు అనేకసార్లు జైలు కెళ్లిన దేశసేవకుడు. ఇంతటిదయ్యు, వినయమే విభూషణముగాగల ఇల్లాలు.

# గాంధీ మహాత్ముని ఉపవాస పరంపర

దక్షిణాఫ్రికాలో ఒకటిరెండుసార్లు ఉపవాసంచేసి అనుకున్నపని సాధించారట.

భారతదేశానికి వచ్చినతర్వాత అహమ్మదాబాదులో మిల్లుకూలీల సమ్మె సందర్భంలో 1918 సం॥న 3 రోజు లుపవాసంచేయగా మిల్లుయజమాన్లు ఆయన కోరినవిధంగా పరిష్కారంచేశారు.

రౌలట్ చట్టనిరోధకోద్యమం సమయాన విపరీతపు అల్లరులు చెలరేగినవని ప్రాయశ్చిత్తంగా ఉపవాసం చేశారు. 1921 నవంబరులో యువరాజుగారు (ఇప్పుడు విండ్సర్‌ప్రభువు) ఇండియాదేశం వచ్చినప్పుడు ఆయనను కాంగ్రెసు ఆజ్ఞానుసారం ప్రజలు బహిష్కరించగా బొంబాయిలో అల్లరులు జరిగాయని 5 రోజులు ఉపవాసంచేసి తపించారు.

1922 లో కాబోలు జైలులో - తన స్నూక్ వగైరా తన కివ్వలేదని ఉపవాసం చేసినట్లు జ్ఞాపకం.

1926 సెప్టెబరులో పలుతావుల మతకలహాలు విజృంభించాయి. అంచేత మతసామరస్యాన్ని అర్థిస్తూ 17-9-26 మొ 8-10-26 వరకు 21 రోజులు ఢిల్లీలో మహమ్మదాలీ ఇంటిలో ఉపవాసంచేశారు.

1932 లో జైలులోనుండగా హరిజనులకు ప్రత్యేక ప్రాతినిధ్య మివ్వరాదని ఆ మరణాంతోపవాసం ఆరంభించారు. 20-9-1932 మొ 26-9-1932 వరకు ఉపవాసం నడిచేసరికి బ్రిటిష్‌ప్రభుత్వం వారంగీకరించగా పూనా ఒడంబడిక జరిగినది.

హరిజనసమస్యను విజయవంతముగా పరిష్కరించుటకు తగిన హృదయపారిశుధ్యము తనకు తన అనుచరులకు కలగడానికని 8-5-1933 మొ॥ 29 5-1933 వరకు 21 రోజు ఉపవాసంచేశారు.

1933 ఆగస్టు 1వ తేదిన వ్యక్తి సత్యాగ్రహమొనర్చి అరెస్టయినారు. తనకంతకుపూర్వము డిటిన్యూగా ఉండగా హరిజనపత్రిక నడుపనిచ్చిన సౌకర్యము లివ్వలేదని కాలపరిమితి లేకుండా ఉపవాసంచేశారు. అప్పుడూ వారంరోజులు గడిచేసరికి ప్రభుత్వమువారు విడుదలచేయగా ఉపవాసం నిలిపివేశారు.

1934 జూలైలో హరిజనోద్ధారణకై తానుప్రచారము చేయుచుండగా కొందరు సనాతన ధర్మపరాయణుల మనుకొను ఛాందసులు వ్యతిరేక ప్రదర్శనము లొకచో గావించిరి. అందుకు కొందరు కుపితులై వారిలో నొక్క ఛాందసునిపై దౌర్జన్యమొనర్చిరి. వారికి తీవ్రగాయము లాయెను. దానిపై మహాత్ముడు ప్రాయశ్చిత్తార్థముగా 7 రోజు లుపవసించారు.

రాజకోటలో ఆమరణోపవాసము సల్పినారు. కాని, వైస్‌రాయిగారిచే ఆపేచీ విచారింపుమని కోరబడిన గాంధీగారిమాట సరియని తీర్పుచెప్పగా విరమించబడినది. ఇది 26-2-1939 మొ 7-3-1939 వరకు సాగినది.

శక్త్యానుసారము—21 రోజుల ఉపవాసమును 1943 ఫిబ్రవరి 9వ తేదీన 'ఆగాఖాన్ భవనము'న డిటిన్యూగా నున్నప్పుడు చేసెను. కాంగ్రెసుపై ఆగస్టు అల్లరులగూర్చిన అపవాదులకు తాను సమాధానమివ్వ నవకాశమును ప్రభుత్వము నిరాకరించెనుగాన ఈ ఉపవాస మొనర్చారు. బ్రిటిష్‌ప్రభుత్వము 'చావనిచ్చుట'కే నిశ్చయించుకున్నది. వైద్యులు ఆశవదలిరి. అయితే ఈశ్వరుడు అనుగ్రహించినాడు.

నేడు ఈ 1వ తేదీ రాత్రి 8, 30 గం॥ ల కారంభించి-74 గం॥ ల అనంతరము మానినారు.

# ఓ గాంధీ

నీబోసి నోటిలో నిఖిల జగముల కెల్ల
కాబోవు ధర్మయుగ రత్నాలు రాలురా
యేకాదశవతారమా ఓగాంధి
శ్రీకరుని సత్తేజమా!

దాస్యశృంఖాలతో దీనస్థితిలోనున్న
సస్యశ్యామల నుద్ధరించి జయమందిన
విశ్వ విజయరూపమా ఓగాంధి
ఆసియా నవ తేజమా!

శాంతి సమరముచేత స్వాతంత్రమును పొంది
నీతి యని నేర్పితివి సాటిదేశాల కిది
సత్యాగ్రహాస్వరూపమా ఓగాంధి
నిత్య తేజోరూపమా!

నిత్యంబు సోదరుల మధ్య తగవుల బెట్టు
శ్వేతరాక్షసి మూక తరిమి వేసితి వయ్య
కరుణాకర స్వరూపమా ఓగాంధి
అరిభయంకర తేజమా!

అంటరాని తనమ్ము మంట గల్పగ నెంచి
యింట హరిజనబిడ్డ నెంతో ప్రేమను బెంచు
సర్వమత సంపూజ్యమా ఓగాంధి
శర్వాణి భవు తేజమా!

సర్వమానవ సేవ సర్వేశు సేవ యని
నిర్వచన మొనరించి నేర్పితివి జగమునకు
దివ్య జ్ఞాన ప్రకాశమా ఓగాంధి
నవ్య తేజోరూపమా!

ఖండఖండము లీన్నియఖండ విజయము గాంచి
అండ జేరగ నీకు స్వాగతము లిడు చుండె
స్వారాజ్య సంపాదకా ఓగాంధి
ధీర భారత నాయకా!

నూటపాతిక యేండ్లు జీవింతు నను బల్కు
మాటలే అమృత మయ వాక్కులగు గాక
దీనజన మందారమా ఓగాంధి
జ్ఞానాంబుధి ప్రకాశమా!

వేంద్ర పాపారావు.

# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. యన్. కేసరి

గోపాలాచార్యులవారును నేనును వైద్యశాలలో పనిచేయుచున్నప్పుడు K B. రంగనాథయ్యరు B. A. గారొకరు కూడ వైద్యశాలలో నౌకరిని సంపాదించుకొనిరి. వీరికి కూడ వైద్యమునందు ప్రవేశముగలదు. వీరు B. A. ప్యాసుచేసి B. L. చదువుకొనుటకు మద్రాసువచ్చి యిక్కడచేరిరి. వీరు B L. ప్యాసుచేసి వకీలుపనిలో ప్రవేశించుటవలన వైద్యశాల నౌకరిని చాలించుకొనవలసి వచ్చినది.

ఆచార్యులవారును నేనును వైద్యశాలలో 4 సంవత్సరములుపాటు సోదరభావముతో కాలమును గడుపగల్గితిమి. ఆచార్యులవారు ఆయుర్వేదాశ్రమమను పేరుతో ఒక వైద్యశాలను స్థాపించి ముఖ్యముగ ప్లేగుమందుల మాహాత్మ్యములను కరపత్రములద్వారా ప్రచురించుచు వ్యాపారమును సాగించిరి. ఆకాలమున బెంగుళూరుప్రాంతములలో ప్లేగు తీవ్రముగ వ్యాపించియుండెను. ఆచార్యులవారికి ఆంగ్లభాష పరిచయములేనందున ఈ వ్యాపారములన్నియును నేనే చేయుచుంటిని. గాని నాకు వారివలన లాభమేమియు లేకుండెను. ఈ కారణమువల్ల నేను వేరుగ కేసరికుటీరమనుపేరుతో వైద్యశాలను స్థాపించితిని. పనిచేయుచున్న వైద్యశాలలో నేను మొదట రాజీనామా యిచ్చితిని. పిమ్మట కొంతకాలమునకు ఆచార్యులవారును రాజీనామా యిచ్చిరి. అప్పటినుండి (వారి వారి) స్వంతవైద్యాలయములను నడుపుకొనుచుంటిమి.

## నా పెండ్లి

నేను మద్రాసులో జీవనోపాయమును సంపాదించుకొన్నందున నామేనమామగారు నాకు పిల్లనిచ్చి పెండ్లిచేసెదనని జాబునువ్రాసిరి. మంచిదని జవాబిచ్చితిని పెండ్లిసన్నాహమునకు కావలసిన సామానులను సమకూర్చుకొనవలసివచ్చెను. నాచేత డబ్బులేనందున

చిన్ననాటి స్నేహితుడగు అన్నం చెన్నకేశవులు శెట్టిగారిని మరల ఆశ్రయించితిని. శెట్టిగారు యింటిలో స్వతంత్రుడుగాడు. చిన్నవాడు. తలిదండ్రులచాటున నున్నవాడు. గనుక వారివద్ద ఆ సమయమున రొఖ్ఖంలేదు. ఆకాలమున మద్రాసులో ధనికులు పురుషులుకూడ చేతులకు బంగారుకాపులును (మురుగులు) గొలుసులును ధరించుకొనుచుండిరి. మా శెట్టిగారుకూడ లావాటి మురుగులను గొలుసులను తొడుగుకొనియుండిరి. ఆ మురుగులు గొలుసులు వారిచేతికి వదులుగనుండెను. అప్పుడు శెట్టిగారు కంసలిబత్తునివద్దకుపోయి తనచేతుల మురుగులలోని బంగారమును కొంత కోసి నాకుయిచ్చి పెండ్లినగలు చేయించుకొమ్మనిచెప్పిరి. ఆ బంగారముతో ఆ కాలపు నాజూకు నగ, నెల్లూరిగజ్జెలపట్టెడను చేయించితిని. కాళ్లకు యేనుగగొలుసులు, పావడాలు, పట్టెగొలుసులు మేలైన జర్మన్‌సిల్వరుతో తయారుచేయించితిని. ఆ కాలమున పేరుపొందిన బాలామణియను ఒక దాసియుండెను. నాటకములలో ప్రసిద్ధి చెందిన నటకురాలు. తారాశశాంకము, డంబాచారి విలాసము యను నాటకములలో బాలామణిని చూచుటకు మద్రాసులో వేలకొలది ప్రేక్షకులు పోవుచుండిరి. బాలామణి అక్క కోకిలాంబ పురుషవేషమును ధరించెడిది. అప్పుడు ఆ బాలామణి పేరుతో చీరలను నేసి బాలామణి చీరెలని అమ్మెడువారు. ఆ చీరెలను రెంటిని నా పెండ్లికి కొంటిని. మెడకు పట్టెడ, కాళ్లకు గొలుసులు, కట్టుచీరెలతో పెండ్లికి ప్రయాణమై వూరికిపోతిని. పట్ణం నుంచి పల్లెటూరికి పెండ్లిసన్నాహముతో పోగానే వూరివారందరు పట్ణంచీరెలను, నగలను చూచుటకు పరుగెత్తివచ్చిరి. ప్రదర్శనము జరిగెను.

నా పెండ్లి మావూరికి సమీపమున చెదలవాడయను గ్రామమునయుండు శ్రీరాముల దేవాలయములో జరిగెను. మా వూరికిని చెదలవాడకును నడుమ గుండ్లకమ్మయేరు అడ్డము. కిండుయిసుకలో చెదలవాడకు నడచిపోవలయును ముహూర్తమునాడు తెల్లవారగనే మాకు మంగళస్నానములయినవి. పాతపల్లకి వచ్చినది. చాకలివారు పల్లకిని మోయుటకు హంసపాదికలతో సిద్ధమైరి. మంగలివారే భజంత్రీలుకూడాను. పల్లకిలో కూర్చుంటిమి. పల్లకిసాగినది. ఏరుదాటినది. ఇసుకలోకి పోగానే చాకలివారి కాళ్లుకాలి ముందుకుపరుగిడ వలసివచ్చెను. మేళగాండ్లు వెనుకచిక్కిరి. కూడవచ్చు పెండ్లివారి సంగతిని చెప్పనేలా? తిన్నగ 12 గంటలకు దేవాలయము ప్రవేశించితిమి. ఒకమూల వంట ప్రయత్నము, మరియొకచోట పెండ్లిప్రయత్నములు జరిగెను.

చెదలవాడ గ్రామము భోగమువడుచులకు ప్రసిద్ధికెక్కినది. ఈ గ్రామమునయందు భోగమువారందరు దేవాలయ మాన్యములను అనుభవించుచు దేవుని కొలుచువారే. వీరిలో ముఖ్యముగ ఎఱ్ఱబాయి, నల్లబాయి, యను పేరుగల యిద్దరు వేశ్యలుండిరి. వీరి కీపేర్లు శరీరపు రంగునుబట్టియే వచ్చినవి. ఈ యెఱ్ఱబాయమ్మ మామగారికి స్నేహితురాలగుటచే పెండ్లి సరఫరా చక్కగజరిగినది. సాయంత్రము చదురుకూడ జరిగినది. పెండ్లి ముగించుకొని పల్లకినెక్కి చీకటికి ముందటనే యిల్లుచేరితిమి.

ఆరాత్రియే వూరి వూరేగింపుకూడ. మా వూరేగింపు చూచుటకు వూరివారందరు కూడిరి. ఆ కాలమున నూనె దివిటీలకు బదులు కుడపపిడకలను కిరసనాయిలులో తడిపి దివిటీలు వెలిగించుచుండిరి. చాకండ్లు దివిటీలను పట్టుకొనిరి. పల్లకి లేచినది. ఊరేగింపు నడివీధికిపోయినది. ఈ దివిటీల కిరసనాయిల్ పొగ వాసనకు పెండ్లికూతురు తట్టుకోలేక కడుపులో త్రిప్పి వమనమును చేసుకొనినది. ఆ వమనము యెదుటనున్న నావళ్లోనే జరిగెను. ఇదియే నాకును అమెకును జరిగిన ప్రథమపరిచయము.

వివాహానంతరము నేను మనుగుడుపులకు అత్తవారి యింట్లో వారమురోజులుంటిని. ఈ దినములలో గ్రామమునసబు, కరణం మొదలగువారు వారి తాతముత్తాలనాటి పాత కోర్టురికార్డులను తీసుకవచ్చి నన్ను చదివి అర్థము చెప్పమనేవారు. పూర్వాచారపరాయణులు కొందరొచ్చి "అబ్బాయి! పట్నంలో జాతివాడు మరద్రిప్పిన గొట్టములోని నీరు త్రాగుచున్నారటనే నిజమేనా? మద్రాసులోని కూరలుతినిన ఏనుగకాళ్లగుట నిజమేనా?" అని అడిగేవారు. నన్ను చూడవచ్చిన ప్రతివకరును తమకు, తమకు కావలసిన వస్తువులను తలావకటి, ఈసారి వచ్చినప్పుడు తెచ్చిపెట్టుమని నన్ను అడిగేవారు. నీళ్లు నిల్వచేసు కొనుటకు పెద్దకొయ్య పీపాయిని తెచ్చిపెట్టమని ఒకరు చాలాదూరం ప్రార్థించిరి.

మాయింటి ప్రక్కననే కమ్మవారుండేవారు. ఒకనాడు వారి దొడ్లోనుంచి వెఱ్ఱికేక వినబడినది. ఆ కేకనువిని అక్కడికివెళ్లిచూచితిని. నులకమంచముమీద ఆడబిడ్డను కూర్చుండబెట్టి మసిలే నీళ్లను ముంతతో ఆపిల్లనెత్తినపోయుచుండెను. మరియొక ముంత మంచముమీద పోయుచుండెను. ఆబిడ్డకన్నతల్లిని అడిగితిని. పిల్లతలనిండుగ పేలున్నవనిన్నీ మంచమునిండుగ నల్లులున్నవనిన్నీ వాటిని చంపుటకు యిట్లు చేయుచున్నాననిన్నీ చెప్పెను.

ఆప్రకారము ఆతల్లి యెంతకాలమునుంచి చేయుచున్నదోగాని కొంతకాలమునకు ఆపిల్లకు మతిచెడి వెఱ్ఱిచూపులపిల్ల అయినది. పేలకు, నల్లులకు సిద్ధౌషధమును కనిపెట్టిన భాగ్యశాలి! ఈ వూరిలోనే నేనుకూడ పుట్టినది.

మరల మద్రాసుకు వచ్చితిని. కేసరికుటీరమునకు చాలినంతమూలధనములేక వృద్ధికి రాజాలక యుండెను. స్నేహితులవద్ద కొంతడబ్బును తెచ్చిపెడితినిగాని హేరాళముగ వ్యాపారమును చేయుటకు ఆడబ్బుచాలదాయెను. ఇట్లుండగ మాతోకూడ వైద్యశాలలో పనిచేయుచుండిన K. B. రంగనాథయ్యరు వారి అన్నగారిపేరుతో ధన్వంతరి వైద్యశాల నొకదానిని స్థాపించిరి. అయితే వారివద్దను డబ్బులేక కష్టపడుచుండిరి. అప్పుడు మద్రాసులో ఆయుర్వేదాశ్రమము, కేసరికుటీరము, ధన్వంతరివైద్యశాలయను పేర్లతో మూడు వైద్యశాలలుండెనుగాని యెవరివద్ద డబ్బులేదు. అప్పుడు రంగనాథయ్యరు నావద్దకువచ్చి మనయిరువురముకలిసి మందులవ్యాపారమును చేయుదము. కావలసిన మూలధనమును నాపరిచితులగు T R రామచంద్రయ్యరు B.A. B L. (సుప్రసిద్ధ హైకోర్టువకీలు) గారిని అడిగి యిప్పించెదనని చెప్పి నన్నువప్పించెను, అప్పుడు కేసరికుటీరములో ధన్వంతరివైద్యశాలను యేకముచేసి కేసరికుటీరం అనుపేరుతోనే మందుల వ్యాపారమును చేయప్రారంభించితిమి. కొంతకాలము జరిగెను, చెప్పినప్రకారము రంగనాథయ్యరుగారు రామచంద్రయ్యరుగారి వద్దనుంచి డబ్బును తేలేకపోయిరి. వ్యాపారము నిద్రపోవుచుండెను. ఇరువురము భుక్తికికూడ కష్టపడవలసివచ్చెను.

అప్పుడు వారిని నేనువిడిచిపెట్టి వేరుగ నాకేసరికుటీరం పేరుతోనే వ్యాపారము ప్రారంభించితిని. క్రమముగ నావ్యాపారము బాగుపడెను. నేను వృద్ధికివచ్చుటచూచి రంగనాథయ్యరుకు కన్నెఱ్ఱనాయెను. వారు వకీలుగనుండుటవలన సులభముగ నామీద క్రిమినల్, సివిలుకేసులను తెచ్చి నన్ను చాలా నష్టకష్టములకు పాలుచేసిరి. తెచ్చిన కేసులు వారికి లాభించలేదు. కడపట Trade Mark Suit వారికి నాకు హైకోర్టులో జరిగెను. ఈ కేసులో జడ్జిగారి సలహామీద వారునేను సమాధానపడితిమి; వారికి నేను కొంతడబ్బుయిచ్చి నామందులకు వ్యాపారమునకు వారికి యేలాటిసంబంధము లేకుండ హైకోర్టుడిక్రీని పొందితిని. ఈ కష్టములకన్నిటికి కారణం యిరువురికి విభాగపత్రము లేకుండుటయే.

నా వివాహమైన మూడుసంవత్సరములకు నాభార్య యింటికివచ్చెను. ఆమె వచ్చినవెంటనే మద్రాసులో క్రొత్తకాపురమును పెట్టవలసివచ్చినది. నాబాల్య స్నేహితుడగు అన్నం చెన్నకేశవులశెట్టిగారికి ఆచారప్పన్ వీధిలో యొక యిల్లుండెను. ఆ యింటిలో వారు మమ్ముల కాపురముంచిరి. అన్నివిధములవారు మమ్ములను కనిపెట్టు చుండిరి. వారియింటిలో కొంతకాలముండి మరియొకయింటికి మారితిమి.

నాగృహిణి కొన్ని గ్రహములతోకూడ నాగృహముచేరినది. ప్రతిదినము యేదో గ్రహము ఆమెకు సోకటము తల ఆడించడము, కేకలు వేయడము దగ్గరకు పోయిన తన్నడము, పీకడము, కొరకడము, ఈలాగున యింటిలో గ్రహములు తాండవ మాడుచుండెను. ఇంటిలో మాకు తోడు యెవరులేరు. పొరుగున అరవకాపురము; దయ్యాలతోకూడ ఆయింటిలో మేముండుట అరవకుల యిష్టములేదు. క్రమముగ నాభార్య మెడసిందుగ లెక్కలేనన్ని రక్తరేకులకు తావుకలిగెను. పలువిధములయిన రుగ్మతలలతో బాధపడుచు మంచమెక్కుచుండెను. ఇదీ యిప్పటి నాసంసారసుఖము.

నా వ్యాపారము దిన దినాభివృద్ధి అయి పచ్చయప్పకళాశాలకు ప్రక్కనయుండు బందరువీధిలో ఒకయింటిని బాడుగకు తీసుకొని వ్యాపారమును యింకను వృద్ధిచేయ గల్గితిని, ఈ సమయములోనే సికింద్రాబాదులో కేసరికుటీరం బ్రాంచిని స్థాపించితిని. ఈ బ్రాంచికి నెల్లూరు కాపురస్తుడగు వరదయ్యనాయుడుగారిని యేజెంటుగ నేర్పాటు చేసితిని, వీరు పోలీసు సర్కిల్ యిన్స్పెక్టరు పదవినుండి తొలగింపబడినవారు.

వీరు సికింద్రాబాదులో పనిచేయుచు తనకుమారునికి కేసరియనిపేరుపెట్టి అక్కడ విక్రయించుచున్న మందులు తనవేయని బూటకపుమందులనుచేసి విక్రయించుచుండిరి. ఈ విషయమును తెలుసుకొని నేను అక్కడికివెళ్లి వారిని అక్కడనుంచి తొలగించితిని. వరదయ్యగారు సికింద్రాబాదునుండి నెల్లూరికివచ్చి స్వంతషాపుపెట్టి కేసరిలోధ్ర, అమృత అర్క యనుపేర్లతో మందులమ్ముచుండిరి. అప్పుడు నేను వారిమీద నెల్లూరిలో కేసు చేయువలసివచ్చెను. వరదయ్యగారు కోర్టులో, నన్ను క్షమాపణకోరుకున్నందున కేసును రద్దుపరచుకొని వారిని విడిచిపెట్టితిని.

నా కాపురము, కమామీసు బందరువీధిలో యున్నప్పుడే ఎగ్మూరులో, యొక స్వంత భవనమునుకొని దానిని పెద్దదిగకట్టించి బందరువీధినుండి ఎగ్మూరుకు మారితిని.

# కోరిన కోరిక

శ్రీమతి అయినపల్లి సుభద్రాకుమారిగారు

"మీరు...ఈ పిలకతీసెయ్యకూడదూ..." అంది మృదుమధురంగా తమలపాకులచిలకలు నోటి కందిస్తూ నాల్గోరోజున. ఈ నవనాగరికతా యుతప్రపంచంలో భర్తని అలాకోరనిదెవరు ?

నాల్గోరోజునే తనని అలాప్రశ్నించటం తలకొట్టి పాతినట్టు తలంచాడు ఆమూర్ఖుడు! భార్య తన పూర్వీకులపట్ల, గృహదేవతలపట్ల, తల్లి, అన్నదమ్ములపట్ల యెంతో అపరాధంచేసిందని భావించాడు! తననేదో అగాధ నరకంలోనికి లాగుతోంది అనుకున్నాడు!

కామశాస్త్రికి తండ్రిలేడు; తల్లి ఉన్నది; నలుగురన్నదమ్ములు, ఓవెధవాడపడుచు వుంది. అంతా ఇక్ష్వాకుల భారసాలనాటిమనుష్యులు, లోకమంతా ఏవిషయాలు ఉత్తమాధనమ్మ కాలంటాయో వాటిమీదే వారికి అమిత విశ్వాసం. వారి వంశంవారంతా గర్విష్టులు, అధికారవంతులు. పోలం కాపుల్నీ, కరణాల్నీ ఇతరుల్నీ నిర్లక్ష్యంగాచూస్తారు. దానికి కారణం వూరివారిచ్చిన గౌరవ మర్యాదలే! ప్రయాణము, వార్తాపత్రికలు, కలహము, సంస్కారము, వారియింటి దరిజేరవు. కాని వారిగృహం, పావనమైనది. యెల్లప్పుడు మంత్రజపాలు, వేదపఠనాలు జరుగుతుంటయ్. ఇతరులతో ఎప్పుడూ సంబంధంపెట్టుకోరు. దేశమంతా కాలచక్ర ప్రభావానికి లోబడి మారిపోతుంటె ఆవంశం నేటికికూడా అలాగే వుండిపోయింది ధృవ నక్షత్రంలా ! వితంతువివాహాలు, క్షెంచి కట్టింగుమీసాలు, గూడకట్లు, పక్కపాపిళ్లు, ఆంధ్రోద్యమాలు, చలనచిత్రాలు వీటిమోత వారికి ఏదో పాతాళలోకంలోంచి పాతిక ఖంఖణాలు చేసినవాడిమాటలా వినబడుతుంది. అటువంటికుటుంబములో జన్మించిన కామశాస్త్రికి నాగరికత, నవ్యత్వాలలో మునిగి తేలుతున్న కుటుబంలో జన్మించిన ప్రభావతి "పిలక తీయకూడదా"అని అడగటం క్షమించరాని అపరాధంగా తోచటంలో ఆశ్చర్యంలేదు. మర్నాడు ఈవిషయం తల్లి, అన్నదమ్ములకు పాఠం వప్పగించాడు.

"నిన్నకాక మొన్న వచ్చిందోలేదో అప్పడే ఆకతాయితనమా?" అనిఒకరు.

వాళ్ల అన్నాయి కాప్రునున్నగడువ్వకొని సిగరెట్టుకాలుస్తూ వీణమీటుతుంటె వీణ్ణిగూడ క్రాపుదువ్వకొని వెనకాల తంబురా సుతివెయ్యమంటుందా?" అని ఒకరు.

"వాళ్ల చిన్నఅన్నాయికిమల్లే జ్వరంకొల్చే గాజుపుడక జేబులోపెట్టుకొని ప్రతియింటికివెళ్లి అయిందానిచేతులు కానిదానిచేతులు పట్టుకు చూడ మంటుందా?" అనిఒకరు ప్రారంభించారు. యిదంతా పక్క గదిలోంచి వింటున్నప్రభావతికి అన్నదమ్ముల్ని ఎత్తిపొడుస్తున్నారని ఏడ్వాలో, భర్తయింతఘనకార్యం చేశాడేఅని నవ్వాలో అర్థంకాక అలాగే నిల్చుండిపోయింది నిట్టూర్పులువిడుస్తూ. పెండ్లినాడే మొరపెట్టుకుంది తనని ఆ అనాగరికపు కుటుంబంలో పడెయ్యవద్దని. కాని తండ్రి ప్రభావతియొక్క ఆందోళన తెల్సుకోలేకపోయాడు. దగ్గరోవుంటుంది. తిండి గుడ్డలకి లోటుండదని కట్టబెట్టేడు. కానీ తర్వాత తెల్సుకున్నాడు తనకూతురి పీకతానే నిర్దయగ నులిమేశానని !

పక్కపాపిడి తీసుకుంటేతప్పు. కాస్తతెల్లచీరకట్టుకొని తలనిండా పువ్వులుపెట్టుకుంటేతప్పు బోగంది బోగంది అంటారు. గదిలో రాత్రిమాటలసందర్భంలో భర్తతోనవ్వితేతప్పు. ఓనాడు ప్రభావతి నూతి

దగ్గఱ నీళ్లుతోడుతోంది. నీళ్లతొట్టిద్వారానికి గుడ్డముక్క అడ్డులేదు అదిచూడకుండా తోడటం మూలాన్ని నీళ్లన్నీ కారి ముందువాకిలంతా తడిసిపోయింది. వెధవాడబడుచు "రెక్కలుముక్కలు చేసుకుని వాకిలంతా అలికాను, తగలబెట్టేసింది. ఛి, ఛీ పనిచేతకాదు, ఏమిచేతకాదు. మానెత్తిన ఎక్కించేందుకు కన్నారమ్మా నిన్నూ" అని సాధించటం ప్రారంభించింది. పొలంనుంచి చెమటలు కక్కుతూ కామశాస్త్రి వచ్చాడు. చేతిలోవున్న తాటికమ్మతో "కళ్లులేవా" అనిగొడ్డును బాదినట్టుబాదేడు. ఒళ్లంతా కదములుకట్టేసింది. అయినా సహించింది ప్రభావతి. కోపించి భోజనంచెయ్యకుండా మంచమెక్కాడు శాస్త్రి. చెంగుపరచుకొని దెబ్బలబాధకు సొమ్మసిల్లి నిద్రపోయింది. మామూలుప్రకారం అల్లారంగడియారం 3 గంటలకి గణగణ మ్రోగింది(అదిప్రభావతి తెచ్చుకున్నదే). ప్రభావతిలేచి వెండిగిన్నెలోకి కాగుతున్నపాలుతీసి అటుకులునానబోసింది. సబ్బుతో ముఖంకడుక్కుంది. శాస్త్రిలేచాడు; "భోంచేశారా"అనిఅడిగింది మంచినీళ్లిస్తూ. "లేదు" అన్నాడు. 'అటుకులు పాలల్లో బోశాను తెచ్చేదా' అందిఎంతో ప్రేమవుట్టిపడేటట్లు. కొట్టినదెబ్బలు నిద్దట్లో మర్చిపోయింది అనుకున్నాడు. "తే"అన్నట్లుగా కళ్లు ఎగరేశాడు. అటుకులగిన్నె చేతికందిచ్చింది. చేతులమీద దెబ్బలు యింకారక్తంకమ్మి అలాగేవున్నాయి! అన్నంతిన్నావా? అనేనా అడక్కుండా అటుకులగిన్నె లగాయించాడు!

భర్త సుఖంగావుంటె అంతే చాలనుకుంది విధిలేక! వెధవాడపడుచు ఏదోవంకబెట్టి తిడ్తూనేయుంది రోజూ. ఓనాడు ప్రభావతి బయటుంది. పుట్టింటివారిచ్చిన దుప్పట్లుచినిగిపోయాయ్. "చలిగవుంది. ఏదైనా దుప్పటైనా, మీతమ్ముడి పంచయినా యిమ్మ"ని అడిగింది ఆడబిడ్డని. ఆవిడ "మీపుట్టింటివాళ్లు దరిద్రులా? తెచ్చుకోలేకపోయావా! ఎవరిస్తారనుకున్నావూ?" అనిసాధించటం ప్రారంభించింది.

"పుట్టింటివాళ్లు ఎన్నాళ్లనియిస్తారు"?కట్టుకున్న వాళ్లుయివ్వకపోతే?అంది. అదిపట్టుకెళ్లి యింకనాలుగు, కల్పించి తమ్ముడిచెవికరిచింది! అప్పగారంటే తమ్ముడికి ఎక్కడిలేని లక్ష్యమూను. శాస్త్రిరుద్రావతారమయ్యాడు! పక్కనున్న వంటకట్టె విశిరాడు భార్యమీదికి. అదిచెంపని గాయంపర్చింది, రక్తంకారుతూంది. అప్పటిదాకా ఓపికపట్టి ఊరుకున్న ప్రభావతి యిక సహించలేకపోయింది. "కట్టుకున్నవారే దుప్పటిస్తారనటం తప్పా? నేనెవర్నీ అనవసరంగతిట్టలేదు, కొట్టలేదు" అందిఏడుస్తూ.

"ఛీనోరముయ్"

"ఎందుకు మూసుకోవాలి? కన్నతల్లిదండ్రులకేనా యివ్వని స్వాతంత్ర్యం స్త్రీ భర్తఅనేవ్యక్తికిస్తుంది ఎందుకిస్తుంది? భర్తలోవున్న ప్రేమమధువుని గ్రోలటానికి. ఆభర్తనే వ్యక్తిలో ప్రేమలేక హృదయం పాషాణమయితే యింకగతేమిటి?"

"చాల్లే కట్టిపెట్టు ...ఏం యింకోకట్టెవిసరాలా?"

"విసరండి ఆకట్టెతోపాటు ఈకట్టెనిగూడా కటువుకిగట్టి అగ్నిలోకి విసరచ్చు" అంది. చెంపనుంచి కారుతున్నరక్తంతో బట్టలుతడిశాయి!

"నీ అన్నలు గొప్పవాళ్లని చూస్తున్నావేమో, ఒడ్డూ పొడుగూ, లావూవున్నారుగదా అని.పిల్లనిచ్చాక కుక్కినపేనల్లేపడివుండాల్సిందే."

"ఆడపిల్లల్ని కన్నవారు అంతలోకువా? నేను మీరనుకున్నంత ఘోరపాపం చెయ్యలేదు. అదంతా కల్పన - నేనడిగింది దుప్పటిగుడ్డమాత్రం; దానికోసం నాఅన్నలు, తండ్రులు, తాతలుగూడ మీనోట్లో కొచ్చారు!" అంది చెంపనుంచి కారుతున్న రక్తంతుడుచుకుంటూ.

"చూశావురా? చూశావురా? కామయ్యా! ఇప్పుడేకాదు. నన్నెప్పుడూ అలాగే ఆడిపోసుకుంటుందది. నేను కల్పించిచెప్పేనా? ఎంతనంగనాచివే? యింతకూ ఆయనపోవటం, నేను మీయింటిదగ్గరఅవుండటం యింతలోకువయ్యాను" అంది లేనిఏడ్పుతెచ్చుగుంటూ ఆడపడుచు. ఈ మాటలు శాస్త్రికోపాన్ని ద్విగుణీకృతంచేశాయి. తనుఏంచేస్తున్నదీ, భార్యఏస్థితిలోవున్నదీ తెల్సుకోకుండా జుట్టుపట్టుకుని "నీదిక్కున్న చోటచెప్పుకో..." అనిబయటి కీడ్చేశాడు. రక్తంగుడ్డల్తో ఆరాత్రి పుట్టింటికి చేరింది. సుబ్బారాయుడు గారు బావురుమన్నాడు కూతురిగతిచూసి. అన్నగార్లు ఈక్షణంవాణ్ణి ఖూనీచేస్తామన్నారు. దూరంఆలోచించి ఆపుచేశాడు తండ్రి. పాపం ప్రభావతి రెండేళ్లుపుట్టినింటిదగ్గఱ అజ్ఞాతవాసంచేసింది.

♦ ♦ ♦

ఆనాడు పౌర్ణమి. చంద్రుడు తనచల్లటికిరణాల్ని వెదజిమ్ముతూప్రయాణం చేస్తున్నాడు ఆకాశంలో. వీధిలోతలుపు కొట్టిన చప్పుడయితే తలుపుతీసింది ప్రభావతి. "ప్రభా"అన్నాడు కామశాస్త్రి! ఆనవాలు పట్టలేకపోయింది. బెంగాలీక్రాపు, తెల్లటి గ్లాస్గోలాల్చీ, బాడీబనీను పయికి కనిపిస్తోంది, అండర్ వేరు పైకి కనుపిస్తూ మల్లుపంచ, నోట్లోసిగరట్. ప్రభావతి తనకళ్లని తానే నమ్మలేకపోయింది.

"ప్రభా, నువ్వుకాపరానికొచ్చిన నాల్గోనాడు కోరినలాగే వచ్చాను భర్తలేక తనెల్లా బాధ లనుభవిస్తోందో, నిన్నుకూడా తనకి తోడుగ చేసుగుందామని మనయిద్దర్నీ విడదీయటానికి ఎన్నో ఎత్తులువేసింది మాఅక్కయ్య. అప్పట్లో నిజానిజాలను తెల్సుకోలేక నిన్ను నానావిధాల హింసించాను. యిప్పటికి కళ్లుతెరిచాను. నీకోరిక నాగుండెల్లోప్రతిధ్వనించింది! నీవుకోరినట్లుగ తయారవటానికి యింతకాలంపట్టింది. నాలో సగభాగం లేకపోవటం ఎంతోలోటనిపిస్తోంది. మనగృహానికెంతో లోటుగవుంది. నీవుకోరినట్లుగానే వచ్చానుగా. ఇంకాకోపమేనా? క్షమించవూ 'ప్రభా' క్షమించవూ!'

"రా......మనయింటికి పోదాంరా......మన 'గృహలక్ష్మిని' పూజిద్దాం! తరిద్దాం.!"

మరుసటి సంవత్సరమే ప్రభావతి పయ్యెదమాటునుంచి మనమడు సుబ్బారాయుడుగారిని" బూచి బూచి" అని ఒచ్చీరాని తొస్సిపల్కులతో వెక్కిరించాడు! ప్రభావతి కోరిన కోరిక ఫలించింది.






## ఉద్దుపప్పు (మినపపప్పు) పచ్చికొబ్బెర పచ్చడి

మినపపప్పు, యింగువ, మిరపకాయలు నూనెతో మినుముల చింతపండుపచ్చడికి మాదిరిగానే వేయించి కొద్దిగ చింతపండుచేర్చి, పచ్చికొబ్బెరను తురిమివేసి నూరవలయును. ఈపచ్చడి నిల్వవుంచకుండ ఖర్చుపెట్టవలయును. నూరునప్పుడు కొద్దిగ నీళ్లుచల్లి నూరవలయును.

☞ సాధారణముగ చింతపండుచేర్చి వేయించి పొడిచేసిన పచ్చళ్లలోను, పులుసులలోను కొద్దిగా మెంతిపొడినిగాని మెంతులనుగానిచేర్చి, బెల్లమునుకూడ చేర్చుటమంచిది.

## మినపపప్పు - వంకాయపచ్చడి

ఈపచ్చడిని పైచెప్పిన పచ్చికొబ్బెరపచ్చడివలెనే తయారుచేయవలయును. అయితే పచ్చిటెంకాయకు బదులు వంకాయను కుమ్ములోపెట్టి చేర్చినూరవలయును. మెత్తగనూరకూడదు.

## వేపపువ్వు పచ్చడి

ఎండినవేపపువ్వును పుల్లలు ఆకులు లేకుండ వేరుపరచి బాణలిలోవేసి కమ్మనివాసనవచ్చువరకు వేయించి, ఆరనిచ్చినపిమ్మట చేతితోరుద్దిన పొడియగును. పిమ్మట బాణలిలో నువ్వులనూనె, ఇంగువ, మిరపకాయలు, మినపప్పప్పు, జీలకఱ్ఱనువేసి వేగినపిమ్మట దించిపెట్టుకొనవలయును. కొద్దిగాచింతపండును పల్చగకలుపుకొని, మిరపకాయలలోవేసి కలియనూరి, వేపపువ్వునుకూడవేసి నూరవలయును. కడపట తిరుగమాత (దీనినే తిరుగబోత, పోపు, పొగపు, తాళింపు అనిపలుపదముల తెలుపుదురు) వేసిన గింజలను కూడ కలిపి, ముద్దపచ్చడిగచేసి వాడుకొనవలయును. ఇదిమంచిరుచిగ నుండుటయేగాక అన్నాశయములో పుట్టుపురుగులను చంపును.

## నక్కదోసకాయ కుమ్ముపచ్చడి

ఈ పచ్చడి తెలంగువారికి ప్రియమైనది. దోసకాయలను కుమ్ములోపెట్టి కాల్చినపిమ్మట కడిగి, వంకాయబజ్జివలెనే నూరవలయును. దోసకాయలు పుల్లగనుండిన పులుసు వేయనక్కరలేదు. దీనిని పచ్చిమిరపకాయలతోగాని, ఇంగువ ఎండుమిరపకాయలు వేయించి, తిరుగబోతవేసిగాని నూరవలయును.

## నక్కదోసకాయ ముక్కలపచ్చడి

నక్కదోసకాయలను చెక్కుతీసి, సన్నముక్కలుగ తరిగిపైపచ్చడివలెనే, పచ్చిమిరపకాయలతోగాని, వేయించిన మిరపకాయలతోగాని పచ్చడిని నూరవలయును. బద్దలు చితుకునట్లు నూరకూడదు.—కొత్తిమెరాకునుగాని, ఇంగువనుగానివేసి నూరవలయును.

## ఆవదోసకాయ ముక్కలపచ్చడి

దోసకాయలను చెక్కుతీసి చిన్నవిగాగాని, పెద్దవిగాగాని ముక్కలుతరిగి, మిరపపొడిలో ఆవాలు, ఉప్పువేసినూరి, తరిగినబద్దలలో కలిపి, పిమ్మట నువ్వులనూనెలో ఇంగువను, తిరుగమాతవేయించి కలిపిన బద్దలలోవేసి, వాడుకొనవలయును.

## వంకాయపచ్చడి (బజ్జి)

ఈ పచ్చడికి కావలసిన వంకాయలు పెద్దవిగను, లేతవిగనుండవలయును. గుండ్రటి నల్లవంకాయలు బజ్జికి శ్రేష్ఠము. వంకాయలను కుమ్ములో కాల్చిగాని, బాణలిలో వేయించిగాని, నీళ్లలో ఉడికించిగాని, పచ్చడిని చేయవచ్చును. పచ్చిమిరపకాయలు, ఉప్పు. కొద్దిచింతపండునునూరి, దానిలో కాల్చిన వంకాయలపైనతోలునువొల్చి, నూరిన కారములోవేసి కలియనూరవలయును. కష్టపడ కొతిమెరాకునుగిల్లి కలుపవలయును. దీనిలో చింతపండుకు బదులు నిమ్మరసమునుకూడ పిండవచ్చును. పచ్చిమిరపకాయలకు బదులు,యెండు మిరపకాయలను వేయించి నూరవచ్చును. పులుసులేకుండ తియ్యబజ్జిగా కొందరు నూరెదరు.

## మామిడికాయ పచ్చడి

ముదిరిన మామిడికాయల పైతోలునుచివ్వి, సన్నగ తరుగవలయును. లేక కొబ్బరతురిమినట్లు తురుమవలయును. మిరపకాయలు ఇంగువ, మెంతులను నువ్వులనూనెలో వేయించుకొని తగిన ఉప్పునువేసి ముందు మిరపకాయలనునూరి పిమ్మట మామిడిబద్దలనువేసి కలియనూరవలయును. లేక పచ్చిమిరపకాయలతో పైమాదిరిగ నూరవచ్చును. ఇందులో, కొతిమెరాకును, ఆవాలనువేసి నూరినపిమ్మట తాళించవలయును.

మరియొకవిధము:—చెక్కుతీసిన మామిడికాయలను తురిమి తీసికొని, బాణలిలో ధారాళముగ నూనెనుపోసి కాగినపిమ్మట మామిడితురుమును నూనెలోవేసి నిదానముగ, సన్ననిసెగన నీరులేకుండ ముద్ద పక్వముగ వేయించవలయును. పిమ్మట కావలసిన మిరపకాయలు, ఇంగువ, మెంతులును వేయించుకొని, తగినఉప్పునువేసి పొడిగొట్టుకొని, వేయించిన మామిడితురుము, కారపొడి రెండును కలియతొక్కి పక్వమైన ముద్దను జాడిలోవుంచిన చాలకాలము చెడకుండ నిల్వఉండును. కొందరు మామిడికాయల తోలుతోకూడ బద్దలనునూరి, ఉప్పువేసి నిల్వవుంచెదరు కాని అట్లుచేయుటవలన బూజుపట్టును.

## నువ్వుల పచ్చడి

నువ్వులముద్దపచ్చడికి నువ్వులను పక్వముగ వేయించుకొని పొడికొట్టి పెట్టుకొనవలయును. పిమ్మట నూనెలో ఇంగువ, మిరపకాయలను వేయించి, మినపపప్పు ఆవాలు జీలకఱ్ఱకూడ తిరుగమాతవేసి, మిరపకాయలు, ఉప్పు, కావలసిన చింతపండునుతీసికొని బాగా బండమీదనూరి, పిమ్మట నువ్వులపొడినికలిపి నీళ్లుచల్లి ముద్దగనూరవలయును. దీనిలో కొంచెము బెల్లముకూడకలిపి నూరవలయును' కొందరు వెల్లుల్లిపాయలనుకూడ చేర్చినూరెదరు.

మరియొకవిధమైన నువ్వులపల్చని పచ్చడినికూడ చేయవచ్చును.

నువ్వులను వేయించి పొడిచేసిఉంచుకొని, కావలసిన చింతపండులోని విత్తులను, యీనెలను యేర్పరచి, నీళ్లలోవేసిపిసికి జారుగకల్పవలయును. పిమ్మట బాణలిలో నూనెపోసి కాగనిచ్చి యింగువవేసి, వేగినపిమ్మట కొద్దిగ యెండుమిరపకాయలను, తొడిమెలుతీయకుండ నూనెలోవేసి పక్వముగ వేగినవెంటనే మెంతులు, ఆవాలు, జీలకఱ్ఱను తిరుగమాతవేసి కమ్మని వాసనరాగానే పచ్చికరేపాకువేసి కల్పిన పులుసును బాణలిలోపోసి నువ్వులపిండినికూడకల్పి కలియపెట్టవలయును. గట్టిగవుండిన కొద్దిగనీరుపోసి, కారపుపొడి, పసుపుపొడినివేసి సన్నటిసెగన నిదానముగ కాచవలయును. తేనెపాకమునదించి వాడుకొనవలయును. దీనిని కొద్దిదినములు వాడుకొనవచ్చును. వేపపువ్వుతోకూడ పల్చని పచ్చడిని యిదేమాదిరిగనే చేయవచ్చును.

# ఇంటిపనులలో మెళకువలు

★

## గర్భధారణ చిహ్నాలు

★

### గర్భం ధరించినప్పుడు మాతలు తీసుకోవలసిన జాగ్రత్తలు

★

అల్లంరాజు విశ్వనాథంగారు

★ ★

సాధారణంగా మనదేశంలోని స్త్రీలకి చిన్నతనంలో నెలతప్పితే, నెలతప్పిందని పెద్దవాళ్లతోటి చెప్పడానికి సిగ్గుపడుతూంటారు. నిజంగా అది గర్భధారణ చిహ్నమా? కాదా? త్వరలో మనం మాతల మవుతామా? లేదా? అనే ప్రశ్నలలో వాళ్లు తటపటా యిస్తూంటారు. అలా తటాపటాయించ నగత్యంలేకుండా గర్భధారణని స్థిరపఱచే కొన్ని చిహ్నాలున్నాయి.

వాటిలో తేలికగా కన్పించే చిహ్నమేదంటే నెల తప్పడమే. కాని యీచిహ్నాన్ని పురస్కరించుకొని గర్భంధరించారు అనుకోడానికి వీలులేదు. ఎందుచేతనంటే కొందఱు యువతులు సరిగా, ప్రతీనెలా బయటవుండడం జరగదు. క్రమం తప్పుతూంటుంది. అందుచేత తదితర చిహ్నాలవలన గాని కేవలంగా యీచిహ్నంవల్ల గర్భధారణాన్ని స్థిరపఱచకూడదు.

గర్భం ధరించిన స్త్రీలకి కొందఱికి ప్రతిఉదయం నీరసంగావుంటుంది. కొందఱికి ఉదయం, మఱికొందఱికి తఱచుగాను, డోకులు వెడుతూంటాయి. కొందఱికి వాంతులు లేకుండా నోరు ఎప్పుడూ అసహ్యంగావుంటుంది.

కుచములలో మార్పు కనిపిస్తుంది. అవి క్రమాభివృద్ధి చెందుతూంటాయి. కుచాగ్రాలచుట్టూ మచ్చ లేర్పడతాయి.

కొందఱికి అధికంగా ఉమ్మి ఊరుతూంటుంది కాని యీలక్షణం అంత సులక్షణం కాదు. అయినా యీఉమ్మి ఊరేలక్షణం చాలా కొద్దిమందికి మాత్రమేవుంటుంది.

కొందఱికి ఆహారపదార్థాలవిషయంలో చాలాచిత్రమైన వాంఛలు జనిస్తాంటాయి. కొందఱికి కారపువస్తువులు తిందామని, మఱికొందఱికి పుల్లనివి, ఇంకా కొందఱికి తియ్యనివి తిందామని వుంటుంది. అక్కడక్కడ కొందరు వారు కోరినవేకాని ఇంకేపదార్థాలూ తినమంటారు. ఇలాగే అనేకరకాల కోరికలుంటాయి.

గర్భం ధరించిన కొంతమంది యువతులకి ముఖంమీద, గర్భకుహరం మీద మచ్చ లేర్పడతాయి.

గర్భంధరించిన నాలుగువారాలకి, గర్భస్థశిశువు పెరుగుతూన్నకొద్దీ ఉదరం పెరుగుతూంటుంది.

కొంతమంది స్త్రీలకి నరముల బలహీనత వుంటుంది. జీర్ణకోశంలోనూ, నాడుల సిస్టమ్‌లోను ఒకవిధమైన అలసట కనిపిస్తుంది.

ఆరవమాసంలో గర్భంలోని పిండం క్రమంగా పెరిగి శిశురూపాన్ని ధరించి, మాతృగర్భంలోని స్థలాన్ని పూర్తిగా ఆక్రమిస్తుంది. అందువల్ల ఆరవమాసంలో మాతకి ఎక్కువ ఆయాసంగా వుంటూంటుంది.

నాలుగైదు మాసాలమధ్య గర్భంలో చలనం బయలుదేరుతుంది. ఈ లక్షణం చాలా ముఖ్యమైనది. ఈ లక్షణాన్నిబట్టే డాక్టరుగాని, పెద్దవాళ్లుగాని గర్భస్థశిశువుకి ఎన్నోమాసమో నిర్ణయిస్తారు.

ఈపై చిహ్నాల్నిబట్టి గర్భంధరించినట్టు స్థిరపడ్డాక, మూడవమాసం దగ్గరనుంచి డాక్టరుదగ్గరకి వెడుతూ, సలహాలు పొందుతూండాలి. అనారోగ్యకరంగావుంటే మూడవ మాసం లోపునుంచే డాక్టరు దగ్గరికివెళ్ళి ప్రతీనెలా పరీక్షచేయించుకోవాలి.

కొంతమంది అబలలు గర్భంధరించినా యితరులతో చెప్పితే వూళ్లోవాళ్లంతా తనని గుఱించే మాట్లాడుకుంటారని భయంచేత, తమ రహస్యాన్ని యితర్లకి తెలియనీయరు. డాక్టరుదగ్గిరికి పరీక్షచేయించుకోడానికి వెళ్ళరు. వాళ్ళు ఒకప్పుడు రహస్యాన్నిదాచినా, నవమాసాల అనంతరం తన స్నేహితులకీ, బంధువులకీ తను చెప్పకుండానే ఎలాగా

తెలియకపోదు. అలాంటి సమయంలో ఇంక వాళ్ళు రహస్యాన్ని దాచడం నిష్ప్రయోజనం. కనక ప్రతీవాళ్లూ డాక్టరు పరీక్ష చేయించుకోవాలి

డాక్టర్ పరీక్షచేసి, ఏనెలకానెల శరీరం బరువు తెలుసుకుంటూ, గర్భస్థశిశువు సక్రమంగా పెరుగుతూందని చెప్పడం ఆవశ్యకం. కనక కాబోయే మాతలంతా యీపనిని చేస్తూండాలి. శరీరంలో పైకి బాధలేవీ కన్పించకపోయినా ఒక్కొక్కప్పుడు సూక్ష్మంగా గుర్తించలేని బాధలుంటాయి. వాటన్నింటికీ డాక్టర్ పరీక్ష అవసరం.

ఈ సమయంలో "ట్రూబీ కింగ్స్" అనే పుస్తకాలని యువతులంతా జాగ్రత్తగా చదవాలి. చదివి ఆ ప్రకారమే ఆచరించాలి.

నవమాసాలు నిండినతరువాత, మొదటి ప్రసవానికి హాస్పిటల్‌లో జేరితే మంచిది. తరువాత ప్రసవాలకి యింటిలో శుభ్రముగావుంటే ఇంటిలోనూ, లేకపోతే హాస్పిటల్‌లోనూ వుండడం మంచిపని.

తలబరువు, తలతిరగడం, తలనొప్పి, ఎక్కువగా వాంతులు వెళ్ళడం, కడుపులోనొప్పి, నడుమునొప్పి—వీటితో బాధ పడుతూన్నప్పుడు మాతలు మందులుసేవిస్తూ విశ్రాంతి తీసుకోవాలి.

వైద్యుని సలహాలేనిదే విరేచనములకు సాధనం చెయ్యకూడదు. అలాచేస్తే ఒక్కొక్కప్పుడు గర్భాశయం ముకుళించుకొనడం జరుగవచ్చు.

సుఖువుగా ప్రసవించాలన్నా, కలుగబోయే బిడ్డ బలంగా, ఆరోగ్యంగా వుండాలన్నా సమర్థుడైన వైద్యుని సలహాలు తీసుకోవాలి. మొదట్లో డాక్టర్ దగ్గరికివెళ్ళి పరీక్ష చేయించుకోవడం శ్రమ అనిపించినా, సుఖప్రసవం అయినతరువాత ఆశ్రమలన్నీ గుర్తుండవు. కనక మన హిందూమాతలంతా గర్భంధరించినప్పుడు తగిన శ్రద్ధ వహించాలి. అలా శ్రద్ధ వహించినప్పుడే, ముందు ముందు, అంగవైకల్యములేని, ఆరోగ్యమైన, దేశసేవకి ఉపకరించే పుత్రీ పుత్రుల్ని కని వీరమాతలౌతారు !






## వెల్లుల్లి

ఉల్లున్న తోటగనుగొని అల్లంతట చెప్పువిడిచి అతివినయముతో
ఉల్లమ్మ ఉల్లినాయన ఉల్లీ ననుగన్నతల్లి ఓ వెల్లుల్లీ !

అనుపాత పలుకులుంగలవు. బ్రాహ్మణేతురుల ఆరోగ్యభాగ్యమునకు ముఖ్యకారణము ఈ వెల్లుల్లిని ధారాళముగ వాడుకొనుటయే. ఇప్పటికిని పల్లెటూళ్లలో ప్రసవకాలమందు వెల్లుల్లి వాడుటవలననే పల్లె పడుచుల పటుత్వమునకు భంగము కలుగకుండ వారు ఆరోగ్యవంతులయి యున్నారు. ప్రసవించిన యింటికి వెళ్లినవారందరు వెల్లుల్లివాసనను అనుభవించెదరు. ఈ వాసనవలన ఇంటనుండు విషక్రిమికీటకాదులు నశించును. గ్రహపీడలు యింట ప్రవేశింపవు. దీనిసేవనవలన బాలింతలకు సమృద్ధిగ పాలుపడి శిశువులను పోషించగలరు. ప్రసవానంతరమున ఈకాలమున వాడు బ్రాంది, కస్తూరిమొదలగు ఉద్రేకద్రవ్యములకంటే వెల్లుల్లి అనేకవిధముల మేలు/ ఇది అందరికిని అందుబాటులోనున్న ఓషధిరాజము. హిందూదేశమున దీనిని ప్రతియింటను సమయమువచ్చినప్పుడెల్లను వాడి దీనిఫలమును అనుభవించుచున్నారు. ఇప్పుడిప్పుడు క్రమముగ మనవారు దీనినివాడుట మరచిపోవుచున్నారు.

ఇటీవలనే ఆంగ్లవైద్యవేత్తలు వెల్లుల్లిమాహాత్మ్యమును కనుగొని దానితో అనేకవిధములైన ఔషధములను తయారుచేసి చక్కనిపాకింగుతో మనదేశమునకుపంపి ధనమును గడించుచున్నారు. పరదేశముల నుండివచ్చు ఈ మాత్రలను దినమునకు మూడు మాత్రలను సేవించుటకంటే, మనయింటిలోయుండిన వెల్లుల్లి పాయను యొకదానిని సేవించినచాలును.

| | | | |
|---|---|---|---|
| ఆవుపాలు | 12 అవున్సులు | వెల్లుల్లి | 10 పాయలు |
| బాదంపప్పు (తోలుతీసినవి) | 5 విత్తులు | చక్కెర | 3 తులములు |

బాదంపప్పును మెత్తగనూరి, పాలలోకలిపి, పిమ్మట వెల్లుల్లిపాయలనుకూడ పాలలోవేసికాచి, పిమ్మట చక్కెరనుకలిపిన బాదంకీరు మాదిరిగ అగును కొద్ది కుంకుమపువ్వును కూడకలిపిన మంచిది.

1. ఈ పాలను ప్రసవించిన స్త్రీలకు నెలదినములిచ్చిన వార్లకు సమృద్ధిగ పాలుపడుటయేగాక ఆరోగ్యవంతులు నగుదురు.

2. వెల్లుల్లిగడ్డను కుమ్మునబెట్టి పాయలువలిచి పసిబిడ్డలకు 1, 2 ని ప్రతిదినం యిచ్చిన కడుపులో యుండు పురుగులు నశించి ఆకలితో అన్నమును తినెదరు.

3. మూర్ఛవచ్చినవారి ముక్కులో యీ రసమును పిండిన మేలుకొనెదరు.

4. ఒకటి రెండు పాయలను చితకకొట్టి నూనెలోవేసి కాచి చెవునొప్పులకు వాడినమానును.

## బ్రతుకు తెరువు

### కరక్కాయ సిరా

కరక్కాయలు ప్రతిగృహలక్ష్మికిని ఎరుకయే. బిడ్డలతల్లులందరును కరక్కాయలను నిరంతరము జాగ్రత్తచేసియుంతురు. బిడ్డలకేమి, పెద్దలకేమి అదిమంచి విరేచనకారి.

కరక్కాయలవల్ల మరొక ఉపయోగమున్నది. దానితో చక్కనిసిరా చేయవచ్చును. ముక్కు పచ్చలారని బిడ్డయు ఫౌంటెన్ కలములను వాడే ఈ రోజులలో కరక్కాయసిరా అన్నప్పుడు మీకు నవ్వురావచ్చును. అది ఎన్నివిధములనో గృహలక్ష్ములకు, విద్యార్థులకు ఉపయోగకారి.

స్వాతంత్ర్యము సిద్ధించినదిగాన ఇక దేశీయనాయకులు - మన దేశము అన్నివిధముల నభివృద్ధినందుటకై పాటుపడుదురు. అన్ని అభివృద్ధులకు మూలము విద్య. ఆవిద్యకు వ్రాతయు, వాచకమును అవశ్యమైన ఉపాంగములు. క్రొత్తగా వెలసిన అచ్చును, టైపు యంత్రమును వ్రాతతో పోటీపడుచున్నవి. సంక్షిప్తలేఖనమును వ్రాతయొక్క ప్రాముఖ్యత తగ్గించునదే. అయితే, దరిద్రవంతము, అజ్ఞానభూయిష్టము నగు నీదేశమున విద్యావ్యాప్తియగుటకు చేవ్రాత ఇంకను చాలవిరివిగా సాగుననుట నిస్సంశయము.

అతిసున్నితముగా వాడవలసిన ఫౌంటెన్ పెన్‌తో—చిన్నబిడ్డలు, కుదిరికలేని వ్రేళ్లతో పట్టి, పట్టివ్రాయుటచే—ముఖ్యముగా, ముత్యములకోవవలె ఉండవలసిన మన తెనుగు—కోతులబారువలె తయారగుచున్నది. కావున చిన్నబిడ్డలు సామాన్య కలములతో వ్రాయుటవల్ల అక్షరము కుదురును.

ప్రస్తుతము మనము మన బిడ్డలకొరకు ఈ ఫౌంటెన్ కలముల సిరానేగాక— మామూలు వ్రాతసిరానుకూడ కొనుటకు అలవాటుపడినాము. నాచిన్నతనములో ఇంటిలోనే ఈసిరా తయారుచేసుకొనేవారు. అదే కరక్కాయసిరా.

కరక్కాయలు పిడికెడు ఎత్తుకొని ఛితుకకొట్టి, విత్తనముతీసివేసి చిన్న చిన్న ముక్కలగునట్లు చేయవలయును. ఆ ముక్కలను బాణలిలోవేసి గ్లాసెడు నీళ్లందుపోయ

వలయును. ఆ నీళ్లలో పాత ఇనుపచీలలు, బందులు లాంటివి నాలుగైదు ముక్కలు విడువవలయును. ఆబాణలిని మిట్టమధ్యాహ్నమప్పుడు 2, 3 గంటలు ఎండలో పెట్ట వలయును. ఇట్లు సుమారు పక్షమురోజులు ఎండలో పెట్టగా, చక్కని నల్లటి సిరా ఏర్పడును. ఆతేరినదానిని తుక్కురాకుండ, బుడ్లకువంచి యుంచుకొని బిడ్డలకు వ్రాసు కొనుటకు ఇవ్వవచ్చును.

ఈ సిరా వ్రాసినపిదప ఆరగనే నల్లగా నిగనిగలాడుచు అందముగా నుండును. నీరుపోసి కడిగినను పోదు. గుడ్డపైనది యొకచుక్క పడినచో, గుడ్డచినిగిపోవునంతవరకు ఆ మరక మాయదు. ఎన్నాళ్లైనను, కాకితముపై దాని రంగు మాయదు. కావున పూర్వము చిరకాలముండవలసిన పత్రములు దీనితో వ్రాసియుంచేవారు.

ఈ సిరా ప్రతిఇంట—స్త్రీలు సులభముగా తయారుచేయవచ్చును. చౌక. తీరిక, అవసరము ఉన్నవారు బుడ్లకొలదిచేసి, అమ్మి ధనము సంపాదింపవచ్చునుకూడా.



# ధ న్య జీ వి

యం. స్వరాజ్యలక్ష్మీదేవి

చరిత్రాత్మకముగ ఆంధ్రజాతి యెట్టి ఉన్నతిని గాంచినదో మనమందర మెఱుగ వలసిన విషయము. ఆంధ్రుల పూర్వోన్నత్యమును కూలంకషముగ దెలుపు గ్రంథము లున్నవి చాలవు. కారణమేమన, అవి సమగ్రముగ లేవేమోనని నా అభిప్రాయము. ఆంధ్రరాష్ట్రము స్థాపితమై, సర్వతోముఖాభివృద్ధి ప్రారంభమైన యనంతరమైనను, విజ్ఞాన శేఖరు లీసదుద్యమమునకు బూనుకొని కృతకృత్యులు కాగలరని నావిశ్వాసము.

మనమెఱుంగని పూర్వరాజన్యుల వదాన్యతగాని, పరాక్రమశౌర్య ధైర్యసాహస ములుగాని వెలయించిన కీర్తిచంద్రికలుగాని, పోషించిన సారస్వత వైభవముగాని, ప్రస్తుత మటుండనిచ్చి గడచిన దాదాపొక శతాబ్దమునందు ఆంధ్రుల పురోభివృద్ధిని స్మరించినచో, మనలో నూతనోత్సాహము కార్యదీక్ష, అసమాన దానగరిమ, సార స్వతాభిరుచి, మరల చిగురించి పెంపు గడించుచున్న సంగతి విదితముకాకపోదు. రాజ కీయరంగమునగాని, దేశారాధన తత్పరతయందుగాని, సంగీత సాహిత్య పోషణయందు గాని, ఋణావియందుగాని, ఆంధ్రమహాపురుషు లెందరో తక్కిన భారతీయుల కేమాత్రము తీసిపోక, ముందంజయే వేసియుండిరి. ఆధన్య జీవులలో మన డాక్టరు కే. యన్. కేసరి (కోట నరసింహంపంతులు) గారొకరు.

వీరిని స్వర్గీయ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారితో పోల్పవచ్చునేమో! కేసరిగారివలె డాక్టరనిపించుకో లేకపోయినను, నాగేశ్వరరావు పంతులుగారు, ప్రతి యింటా, ప్రతిమనిషికి, వేద్యమై అందుబాటులో ఉండుటయేగాక, దేశాంతర ఖ్యాతి గడించి, లక్షలాది ధనమును సమకూర్చిపెట్టిన "అమృతాంజనము"ను మనకు ప్రసా దించిరి. వారి అమృతాంజన మెంత ప్రాముఖ్యత గడించినదో డాక్టరు కేసరి "లోధ్ర" కూడా అంతటి పేరు ప్రతిష్టలను గాంచినది. లక్షలాది ధనమును సేకరించి పెట్టినది. ఈవియందు సైతము మొకరినొకరు మించకలిగి నారని చెప్పుకొనవచ్చును. ఒకరు "భారతి"ని మరొకరు "గృహలక్ష్మి"ని సృష్టించి, పోషించుచున్నారు. నేడు భారతీ గృహలక్ష్ములే ఆంధ్రజాతి మన్ననలందిన సచిత్రమాస పత్రికలు. త్రిమూర్తులలో నొకరగు చతుర్ముఖుని రాణియగు వాణిని చిరస్మరణీయనుగా నొనర్చిన నాగేశ్వరరావు పంతులు గారికన్న ఆంధ్రయువతీ మణులనే చిరస్మరణీయలనుగా నొనర్ప పాటుపడి కృతార్థులైన కేసరిగారే గడుసువారనక తప్పదు.

"గృహలక్ష్మి" పత్రికను స్థాపించి. తద్వారా స్త్రీలకు వారు చేసినసేవ, వారిలో కలిగించిన ప్రబోధము, ధైర్యసాహసములు, సారస్వతాభిరుచి మరపునకు రానిసంగతులు.

"గృహలక్ష్మి" యెంతటి దైనందినాభివృద్ధి ఆ మహాపురుషుని కరకమలము లందు లాలింపబడి గాంచినదో, అంతటి అభివృద్ధి స్త్రీలహృదయములందు విజ్ఞానరూపమున కలిగినది. గృహలక్ష్మియం దెక్కు డభివృద్ధి పొడసూపినదో, ఆమెయు సువర్ణకంకణము వరించినది. ఈకారణమున, ఒకరిని మించి యొకరు స్త్రీలలో ప్రత్యేక కృషిసలిపి ముందంజ వేయుగలిగినారు. సువర్ణ కంకణములు ప్రతి సంవత్సరము దొఱుకుచునే యున్నవి. పూర్వము మహారాజు లేబహూకరణ మొసంగిరో, శ్రీకృష్ణ దేవరాయ లెన్నడు పెద్దన్న కవీంద్రునికి గండపెండెరము సమర్పించెనో, మనము ప్రత్యక్షముగ జూచి యుండలేదుగాని, నేడుమాత్రము కేసరిగారు ప్రతియేడు సువర్ణకంకణములను నియమముతో గృహలక్ష్ములకు సమర్పించుచుండుట చూచుచున్నాము. 'ధనమూల మిదం జగత్తను, సామెతను దృష్టియందుంచుకొని, దాని యాదార్థ్యమును నిరూపింప దలచికాబోలు, ధనాఢ్యు లెందరో వర్ణనాతీతముగ మెలగుచుండగ, యీమహాపురుషుడు వారి పోకడను నిరసించి, స్వార్థ రహిత దృష్టితో వేలాది ధనమును వెచ్చించుచున్నాడు. వెచ్చించుటలోనే ఆయన కపరిమితానందము లభించుట మహా విశేషము.

సువర్ణ కంకణ సమర్పణ సమయములో స్వయముగ తామే గృహలక్ష్ముల కరముల కలంకరింప జేయుచూనుటలో నొకగొప్ప రహస్యముండినది. దానిని గ్రహించుట కింతవరకల్పజ్ఞాననగు నాకుచేత కాకపోయినది. కాని నేడు దానినే కేసరిగారు బహిర్గత మొనర్చిరి. కేసరీహైస్కూలు వార్షికోత్సవ సందర్భమునం దుపన్యసించుచు,

"చదువుకొను నప్పుడు నన్నాదరించి నాకు అన్నము పెట్టిన అమ్మల అమృత హస్తములకు ఏటేటా 'గృహలక్ష్మి స్వర్ణ కంకణము' అనే పేరుతో బంగరుతోడాలను తొడుగుచున్నాను."

అని సెలవిచ్చినారు.

పురుషులకు అమ్మల అమృత హస్తములనుండియే అన్నము దొరుకు చుండును. దీని నెవరు కాదనగలరు? ఎంతమంది ఆ అమృత హస్తములకు బహుమాన మొసగు చుండిరి? ఇది నాప్రశ్న, స్వంతతల్లులకు బంగారు తోడాలను తొడుగుకొన నిచ్చుటలో గొప్పతనము లేదుకాని, ఎన్నడో చిన్నతనము నందు అన్న మొసగిన అమృతహస్తము లను దృష్టియందుంచుకొని, ఆ అమృత హస్తములు ప్రతిగృహిణికి కలవనుమహోన్నతాశ యమును నెలకొల్పుకొని, విశాలహృదయముతో నియమము తప్పకుండ ప్రతి ఏడు యే అమృత హస్తద్వయమునకో బంగారు తోడాలను స్వయముగ తొడుగుట డాక్టరుగారి వంటి అమృత హృదయునికే తగును. స్వర్ణ కంకణమున కర్హత సంపాదించుకొనిన గృహ లక్ష్మి వారికన్న వయస్సునందు, విజ్ఞానమునందు చిన్నకావచ్చును. కాని స్త్రీమూర్తి కనుల బడినంతనే వారికి అమృత స్వరూపము సాక్షాత్కరించి, మాతృదేవిగా గోచ

రించునేమో? లేకున్న "అన్నమిడిన అమ్మల అమృత హస్తముల" ని కృతజ్ఞతా పూర్వకముగ బంగారు తోడాలను సంతోషమున చెంగలించు నిండు హృదయముతో తొడుగజాలరు. ఈపూజ్య భావము స్త్రీమూర్తుల యందు కలుగుటకు కేసరిగారు పూజ్యులగుటయే కారణము.

"కేసరి కుటీరము, ఆయుర్వేద ఔషదశాల" అని నారాయణ మొదలివీధి యింటి వీధి గోడమీద బొగ్గుతో పెద్ద అక్షరాలతో వ్రాయుటకు పూర్వము, అదేవారి అదృష్ట రేఖ ధరించిన మొదటి సైన్‌బోర్డుగా ఉపకరించుటకు పూర్వము, జార్జిటౌన్ ఆదియప్ప నాయక్ వీధిలో వ్యాపారము చేస్తుండిన జగ్గయ్యపేట వర్తకులు నరసింహులు శెట్టిగారు మామూలుగా యిచ్చేపావలా డబ్బులు గాక పుస్తకాలు అగత్యంగా కొనవలసి వచ్చి మరొక పావలా అదనంగా యివ్వవలసినదని కోరినందున కలిగిన రోషమును నిగ్రహించుకొనజాలక "మామూలుగా యిచ్చేపావలా గాక పైన ఒకపావలా వడ్డీగూడా కావాలా" అని యీసడించుచు, లేతవయస్సులో, 'నా' యనువారు లేనిదుస్థితిలో, విద్యోపార్జనకై శాయశక్తులా ప్రయత్నించు పిల్లడనుభావము విస్మరించుచు, స్పృహతప్పి పడిపోయేటట్లు కణతమీదకొట్టినప్పుడు, మగనిగద్దించి, చాలానొచ్చుకొని, మంచినీళ్లు త్రాగించి, పుస్తకములుకొనుక్కొమ్మనుమని రూపాయిని చేతిలోపెట్టిపంపిన అతనిభార్య హస్తములను పరికించి, మరువని కారణముననే, బహుశా కేసరిగారు నాటినుంచియే, నేటివరకు స్త్రీహస్తముల నమృతహస్తములుగా భావించుచున్నారేమో నెవరెఱుగగలరు! అబ్బా! ఎంతటి ఔదార్యోపేతమైన కృతజ్ఞత! ప్రేమ ప్రేమను కలిగించితీరునని గాంధీ మహాత్ముని నిత్యప్రబోధమువలెనే, కృతజ్ఞత కృతజ్ఞతను కలిగింపక తప్పదని కేసరిగారి నిరూపణ. తమరిని పొగడుట కేసరిగారికి అయిష్టము కావచ్చును. కాని వారిని పొగడకుండ నుండుటయెట్లని నా విచికిత్స. మహాపురుషులు స్తోత్రపారములకు తబ్బిబ్బులు కారనుట నిజమే. కాని వారి అసమానజీవిత విశేషములు చిరస్మరణీయము లగుటలో ఆశ్చర్యములేదు.

స్వర్ణకంకణములను సమర్పించుటతోమాత్ర ముపేక్షింపక, స్త్రీజనాభ్యుదయమెట్లు కలుగునాయని అహర్నిశ పాటుపడుచున్న ప్రముఖులు కేసరిగారు. వారుగృహలక్ష్మిలో సంపాదకీయవ్యాసమునందుగ్గడించి పేర్కొనిన అంశములే ప్రబల తార్కాణములు. వారి "గృహలక్ష్మి" విజ్ఞానప్రబోధమును, వారి "లోధ్ర" శరీరారోగ్యమును స్త్రీలకు నిరంతరమందజేయుచున్నవి.

ఇట్టి ధన్యజీవికి నాధన్యవాదములు పరమేశ్వరుడు మరొక 73 సంవత్సరముల వరకైన 'కేసరి' కి మనుగడ ప్రసాదించుగాకయని ప్రార్థించుచున్నాను.

# ఆంధ్ర పతివ్రతలకు హెచ్చరిక!

"అనపహార్యంబు, తేజోమయంబు, సర్వ
గుణములకు అలంకారంబు; గురుతరంబు,
భామలకు పతిభక్తి యపరమైన
భూషణం; బిట్టివే పెఱభూషణములు?"

బ్రతుకు క్షణభంగురంబు; గౌరవము స్థిరము.
పరమ లక్ష్యమదే పతివ్రతల కెపుడు;
కాన, గౌరవమున్ గోరు కాంతలెల్ల
అల 'విడాకుల బిల్లు'పై ఆంక్షయిడుఁడు!

గొడ్డళ్ళ తోరణము వలె
గడ్డయిన విడాకు బిల్లు కాశేశ్వరుఁడే
ఒడ్డోలగమున నిడెఁగా!
అడ్డగుమున్, దాని ద్రుంచి, అందుఁడు కీర్తిన్.

మనకు భయమేమి? అని మీరు చనదు తలఁప;
కలరు కొందఱు మీలోన కాగితంబు
నలుపు చేసెడి వారలు; కలదు మోజు
వారిలో కొందరకు బిల్లుపై నెఱుగమిఁ.

అఱకొఱచదువులె చదివిన
తెలివలె స్త్రీలతికి ఇపుడు తీర్పరులగుటన్
పెఱవారు వారి వలనన్
చెఱుపొందరె? స్త్రీలకీర్తి చెడదే దానన్?

"భరతఖండము ఘనపతివ్రతల భూమి."
అనెడుకీర్తి జానకి, దమయంతి, మొదల
యిన పతివ్రతా రత్నంబు లెన్నిపాట్లొ
పడిగడించిరి; అదినిల్ప వలదె మీరు?

దూరదృష్టియు, సత్కీర్తి గౌరవంబు
వెలితి అగుటఁ విడాకుల బిల్లుమీఁద
కొందఱే మోజుచూపినన్ అందఱకది
ఇష్టమె అని వాదించు కాశేశ్వరుండు.

కాన, పురములయందును-గ్రామములను
కూడిఓ! విడాకుల బిల్లు కూడదనుచు
గట్టి తీర్మానమున్ చేసి, కర్తకు-దొర
తనము వారికి పంపుఁడు; కనుఁడు కీర్తి.

వంశదేశంబులకు ఎందు ప్రథితకీర్తి
స్త్రీలచేత నేవచ్చు; ఆస్త్రీలనడత
యందు మచ్చపడినఁ తలక్రిందులైన
తొలఁగదపకీర్తి; బాధ్యత తెలిసికొనుఁడు.

## ఆంధ్రపతివ్రతలకు హెచ్చరిక !

మగువ పతివ్రత అగుచో
మగఁడామెకు దాసుఁడగును; మరచిన మొదటన్,
వగచి–శకుంతల కాళ్ళన్
తగిలెన్ దుష్యంతుఁ; డిద్దితథ్యముకాదే?

తుంటరి ఎవండో భార్యను దుఃఖపెట్టు
నని విడాకుల బిల్లు శాసనముచేయ
తగదు; దానిఁ పుల్లాకుగా తెగడవలయు;
సభలు కావింపుఁడీ! ఆంధ్ర సాధ్వులార!

పెండ్లిమార్పు క్రీవణఁకులన్ బీటలుపడి,
స్త్రీలసత్కీర్తి సౌధంబుచెడె, విడాకు
బిల్లు బాంబువడినయెడ పెళ్ళుమనుచు
విఱిగిపడదె? హెచ్చరిక! ఓ వెలఁదులార!

ఇట్టులీ హెచ్చరికచేయు, ఇపుడు తెనుఁగు
స్త్రీల సత్కీర్తి పోగొట్టు చెడువిడాకు
బిల్లు శాసనమగుటకు ఒల్లనికిఁ,
సకల హితమతి మా. రామచంద్రశాస్త్రి.


: జండూ బాలామృతం :




క్షీణించి అనారోగ్య వంతుల్గుగ
నుండు బిడ్డలకు అమృతము
సీసా 1-కి రు 1-1-0.
జండూవారి ఏజంట్లయొద్ద దొరుకును

బాలింత

రక్తమును, క్షీరమును వృద్ధిచేయు రసాయనము. సూతికాసంబంధమగు జబ్బులు రాకుండ కాపాడును. నీరసము, దడ, మందాగ్ని విరేచన బద్ధకము, రక్తహీనత లేకుండా చేయును. ప్రసవించిన తరువాత చాలా రోజులవరకు అగు తెల్లమైలను మాన్పును.

బాలింత సేవించిన తల్లులకు క్షీరమును వృద్ధిచేయును. పిల్లలకు లివరు వ్యాధులు రాకుండును. బాలింతలు కట్టెకారము తినవవసరములేదు. ఈమందే ఒడలును గట్టిపరచును.

అన్నిమందుల షాపులలో దొరుకును.

తయారుచేసినవారు :—

ఓషధి ఫార్మస్యూటికల్స

జి. టి., మద్రాసు.

తెలుగు జిల్లాలకు

గుడివాడ ఆఫీసునుండి పంపబడును.

# ★ రాయలసీమ వీరాంగనలు ★



గొప్ప ధనవంతమగు వైశ్యకుటుంబమునకు చెందినవారు, వీరి భర్తగారు శ్రీ యలకూరు యల్లయ్య శ్రేష్టిగారును, వారి సోదరులును బ్యాంకర్లు సబ్బులపరిశ్రమ నెలకొల్పి నడిపినవారు. చిరకాలముగా కాంగ్రెసు సేవాపరాయణులు. ఈమె 1941 సం॥న నంద్యాలలో వ్యక్తిసత్యాగ్రహమొనర్చి, శిక్షపడి కారాగారవాస మొనర్చిరి.

శ్రీమతి యలకూరు సుబ్బరత్నమ్మగారు



శ్రీమతి ఔకు లక్ష్మీదేవమ్మగారు

వీరును 1941 లో నంద్యాలలో వ్యక్తిసత్యాగ్రహ మొనర్చి, శిక్షపడసి కారాగారవాస మనభవించిరి.

# అనుమానం

★

దీపాలు పెట్టారు. 6 గం॥ లు అయినవి. "ఇంకా మధు రాలేదేమిచెప్మా! ఈరోజు సినీమాకు తీసుకు వెళతానని చెప్పి-ఇంత వరకు రాకపోవుటకు కారణము ఏమిటి! కాలేజి 5 గం॥ లకే విడుస్తారే?" అని జ్యోతి తన తమ్ముడయిన మధునిగురించి ఆలోచిస్తూ గదిలోకూర్చుని వుంటుంది. "ఏమిటి అక్కయ్యా అలాగున ఆలోచిస్తున్నావు? నాకోసమేనా?" అంటూ మధు లోపలకు ప్రవేసిస్తాడు.

"ఇలాగుచూడు అక్కయ్యా! నామీద కోపము వచ్చిందా? ఈరోజు ప్రాక్టికల్ వుండుటచేత ఆలస్యమైనది; క్షమించు అక్కయ్యా!"

"క్షమించుటకు నేను ఎవరు మధు!"

"అలాగున అనకు అక్కయ్యా! నీతరువాతనే నాకు ఎవరయినా."

మద్రాసులో మధు B. Sc చదువుచున్నాడు. జ్యోతి, మధు, పినతండ్రి పెదతండ్రి బిడ్డలు. జ్యోతి తండ్రి ప్రసాదరావుగారు మద్రాసులో వకీలు, ప్రసాదరావుగార్కి జ్యోతి ఒకర్తె కూతురు; జ్యోతి తల్లి అయిన లక్ష్మీదేవిగారు పూర్వాచార పరాయణురాలు అగుటచేత జ్యోతికి 12 సం॥ పెండ్లి చేశారు. కాని జ్యోతి 13 సం॥ భర్తపోయిన అభాగ్యురాలైనది. జ్యోతి అందాల భరణి. మంచిహృదయముగల వ్యక్తి; ఎవరు కష్టపడినా చూడలేనటువంటి జాలిగల నిర్మలజీవి. మధు తండ్రి ప్రకాశరావుగార్కి పిఠాపురం దివాణంలో 200 రూ॥ జీతము. జ్యోతికి మధు అంటే ఎంతో ప్రేమ, మధుకి జ్యోతి అంటే ఎంతో ప్రేమ. ఆమెజీవితము అలాగున అయినదని మధు మనస్సు ఎప్పుడు జాలిగాను, కష్టముగాను వుండేది. సోదరి జ్యోతి మనస్సు ఎప్పుడు కష్టపెట్టేవాడు కాడు. జ్యోతి ఏపని చెప్పినప్పటికి, తనకు ఎన్ని పనులున్నామాని, ముందర జ్యోతి పనిచేసేవాడు.

రచన:
శ్రీమతి బి. సరోజినీదేవిగారు

"అమ్మా. జ్యోతీ, అన్నానికి రాతల్లీ?"

"మధు కూడ రానీయవే, వాడూ నేనుతింటాము."

"వాడికోసము నీవు కూర్చోడ మెందుకే? అయినా ఇలారా; నీకు ఒకమాట చెప్పాలి."

"ఏమిటే అమ్మా?"

లక్ష్మి-:జ్యోతీ, నీకు ఒకసంగతి చెపుతాను, నీవు ఏమి అనుకోకు తల్లీ!

జ్యోతి:-ఏమిటే చెప్పు; నేను ఏమియు అనుకోను.

ల:-చూడుతల్లీ నీవు మధుతోటి షికార్లు, సినిమాలకు వెళ్లుట బాగుండదు. అయినా వాడితోటి అంత ఎక్కువగా మాట్లాడ వద్దు. ఎవరయినా చూస్తేబాగుండదు. అందుచేత నీవురేపటినుంచి వాడితోటి ఎక్కడికి వెళ్లకు.

జ్యో:-అదేమిటమ్మా! అలాగున అంటున్నావు? తమ్ముడితోటి కూడ మాట్లాడుట తప్పేనా? అయితే నాజీవితము అంతపాడయినదా? ప్రపంచకము అంతదుర్మార్గముగా ప్రవర్తిస్తున్నదా? అక్కా, తమ్ముడి మీదేనా అనుమానము? ఈసంఘంలో నాబోటి స్త్రీలు ఎవరితోటి మాట్లాడినా తప్పేనా? తమ్మునకు నేను అంటే ఎంతో దయ; ఎలాగున మాట్లాడుట మానమన్నావు అమ్మా!

ల:-అమ్మా! నేను తప్పుకోసము చెప్పుటలేదు. నీకయిన 18 సం|| వచ్చినాయి. నీకన్న 6 నెలలే కదా మధు చిన్నవాడు. నీకుమాత్రము మంచి చెడ్డలు తెలియవా? వాడితల్లి, అక్కలకు, నీవుచెప్పే మాటలు అన్నీవాడు వింటూయున్నాడని, వాళ్లకు అనుమానం. నీతోటి వాడుమాట్లాడుట ఎంతమాత్రము వాళ్లకు ఇష్టములేదు.

జ్యో:-పోనీ అమ్మా! వాళ్లమాటలు వాళ్లకే వుంటాయి.

ల:-పిచ్చితల్లి! నీవు మొన్న డిసెంబరు శెలవులకు పిఠాపురం వెళ్లినప్పుడు ఎన్నిమాటలన్నారు. నీవు వాడు, కలసి సినీమాలకు, షికార్లు, వెళతారని, ఒకచోటే కూర్చొనే వాళ్లని, నేను చెప్పదగనటువంటి మాటలు అన్నారు.

జ్యో:-పోనీవే! మాట్లాడుట మానివేస్తాను.

అని జ్యోతి తన గదిలోనికి వెళ్లిపోయి ఆలోచనలో పడింది. 'ఛీ' పాడు ప్రపంచకము. నాబోటి అనాధస్త్రీ సోదరునితో మాట్లాడి నంత మాత్రాన్నితప్పా? భర్తవున్న స్త్రీ ఎటువంటి తప్పుచేసినా తప్పులేదు? భర్తలేని స్త్రీ ఆశదాని తోటి మాట్లాడినా తప్పేగదా? నేను బ్రతికి వుండేకన్న ఈప్రాణాలు వదులుతే నయం' ఈమాట అనుకొనేసరికి జ్యోతి కళ్లంట నీళ్లు గిర్రున తిరిగాయి. ఇంతటిలోకి మధుయొక్క జోడు చప్పుడు వినేసరికి కళ్లంట నీరు గబ, గబ, తుడుచు కొనేసుకుంది. "అక్కయ్యా ఏమి చేస్తున్నావు" అంటూ జ్యోతి ముఖము చూడగానే. "అదేమిటి అక్కయ్యా ఏడుస్తున్నావు! నాతో చెప్పవు? నేను నీతమ్ముడిని గాను?" అంటూ జ్యోతియొక్క కళ్లనీళ్లు తుడుస్తూవుంటే మధుకి కూడా కళ్లనీళ్లు వచ్చాయి. "ఛీ! అదేమిటి మధు, నీవు ఏడుస్తున్నావు వూరుకో?"

"ఎందుకు ఏడుస్తున్నావు నాతోటి చెప్పవు అక్కయ్యా?"

"ఏమిలేదు మధు,నీవు నన్ను ఆపేక్షతో చూస్తునందులకు ఈప్రపంచకము ఓర్వలేకుండగా యున్నది. నానోటంట నేను అనకూడదుగాని లోకం మనమీద అనేకవిధాల అనుమానం పడుతోంది, ఇంకేమి చెప్పమంటావు మధు!"

"ఓస్, ఇంతేనా! ఇంకా ఏమిటో అనుకొన్నాను, నీవునిజంగా పిచ్చి అక్కయ్యావు. ప్రపంచకము ఏమి అనుకుంటేనేకేం. మన సోదర ప్రేమ మన మనస్సులకు తెలుసు, మనము పవిత్రమైన మనస్సులతో ప్రవర్తిస్తున్నాము. జనులు ఎటువీలుగావుంటే అటుమాట్లాడుతారు. నీవు పిచ్చి పిచ్చి అనుమానములు పెట్టుకొని మనస్సు పాడుచేసుకోకు. ఎవరెన్ని అనుమానములు పడినా నీవు, నేను, బ్రతికి వున్నంత వరకు మన సోదర ప్రేమ ఇలాగునే వుంటుంది. పైన భగవంతుడు సాక్షి, నీకునీమనస్సు, నాకు నామనస్సుసాక్షి. ప్రజల అనుమానములకు భయపడకు. లే! సినీమాకు ఇవాళ వెళదాము. ఇవాళ పరదేశి సినీమా; అందులో వాళ్లసోదర ప్రేమ చూద్దాము."

# గాంధీ తాతా!

"కవిచంద్రులు" కోటసోదరకవులు, అష్టావధానులు,
శ్రీ మన్మంగళ కస్తూరి

రామా హృదయేశ! లోకరంజిత సుగుణా
నీ మహిమ లెన్నతరమా!
కామిత వరదా! మహాత్మ గాంధీతాతా!

పుట్టినది భారతావని
పట్టినది స్వాతంత్ర్య యాగఫలితార్థము, చే
పట్టినది శాంతి ఖడ్గము
కట్టినదే ఖాదివలువ గాంధీతాతా!

ఇలపై బుద్ధుని కంటెను
తలపఁగ శిబికంటె, ధర్మతనయుని కంటెన్
వెలయు నహింసా శీలము
కలిలో నెవరీఁడు నీకు గాంధీతాతా!

ధీరోదారము, జగదుప
కారము, నిజకార్య దీక్ష, గౌరవమహితా
కారము, సత్య స్ఫురణయు
కారుణ్యము, నీకు నగలు గాంధీతాతా!

హిందూ ముస్లిము సోదరు
లందరు సంఘీభవించి యాంగ్లేయుల బా
రందోలుట కార్యంబని
కందుగ బోధించితీవు గాంధీతాతా!




# పిల్లల శీలము - తల్లుల బాధ్యత

శ్రీమతి అల్లాడి అన్నపూర్ణమ్మగారు.

"సిగ్గూ, లజ్జా లేకుండ పెరిగింది ఈ అమ్మాయి," అని కొందరి పిల్లలనుగురించి చెప్పడం మనకు మామూలు. "అబ్బా యీపిల్లకు ఎంతసిగ్గు. ఇంత సిగ్గైతే ఏలాగు కాలక్షేపంచేయడం. పదిమందిలో తిరగడం ఎలాగు?" అని మరికొందరి పిల్లలనుగురించి చెప్తుంటాం. సిగ్గు లేకపోవడాన్ని గర్హించాం మొట్టమొదట. సిగ్గువుండడం నింద్యార్హమని తర్వాత చెప్తున్నాం - ఈ రెండింటిలో ఏది ప్రశంసింప తగ్గది? ఏది నిందింప తగ్గది? ఇదే ప్రశ్న.

ఈ ప్రశ్నకు జవాబు లేకపోలేదు. కొన్ని సందర్భాలలో సిగ్గువుండడమే సబబు, కాని మరికొన్ని సందర్భాలలో సిగ్గులేకుండ వుండడమే మంచిది. ఏ సమయాలలో సిగ్గు పడవలెనో, ఎప్పుడు సిగ్గుపడకూడదో మనం వివక్షత చేయడం అవసరం.

సమయాసమయాలను కనిపెట్టక ఎల్లప్పుడూ సిగ్గుపడేవాడు సిగ్గరి. ఆ విధంగా సిగ్గుపడడం ఒకలోపం. పిల్లలశీలంలో అట్టిలోపం కనుపించకుండా ఉండేటట్లు తల్లులువారిని తర్ఫీదు చేయడం అవసరం.

అనవరసంగా సిగ్గుపడడం మూలాన చేయవలసిన పనులను చేయక పోవడంగాని, లేక చక్కగా చేయకపోవడంగాని జరుగుతుంది. పిల్లవాడు చదువుకొన్నవాడు కావచ్చును. చాలా జ్ఞానంఉన్నవాడు పాండిత్యం సంపాదించినవాడు కావచ్చును. కాని పదిమందితోకూడి సభలోకి వచ్చినప్పుడు సిగ్గుపడనియెడల అతని పాండిత్యము, జ్ఞానం, వ్యర్థమగును. సిగ్గుమూలాన మామూలుగా చేయదగిన పనులు ఆగి జంకుగా పరిణమిస్తుంది.

కాని సిగ్గు వుండడంకూడా అవసరమే. ఇంతకూ సిగ్గంటే ఏమిటి? ఇతరుల సమక్షమున కొన్నిపనులను చేయడానికి వెనుదీయడమే సిగ్గు. అయిదారేళ్ళ వయస్సువచ్చినా పరికిణీలు కట్టుకోకుండా, గోచీ పెట్టుకోకుండా తిరుగుతున్నారని అనడం మనకు సహజం.

అంతటి వయస్సువచ్చిన తర్వాతకూడా ఎక్కడంటే అక్కడ దొడ్డికి కూర్చుంటారు కొందరు పిల్లలు. అట్టివారిని చూచి సిగ్గులేనివారని అంటాము. ఇవన్నీ సంఘానికి సంబంధించిన విషయాలు. సాంఘిక మర్యాదలకు, అలవాటులకూ భిన్నంగా ప్రవర్తిస్తే సిగ్గులేక ప్రవర్తిస్తున్నారంటాము. పెద్ద లెవరైనావస్తే లేచి నిలబడకపోవడం, కుర్చీమీద కాలు జాచుకొని కూర్చుండడం – ఈలాటి పనులను ఎవరైనాచేస్తే వారికి సిగ్గులేదని నిందించడం సర్వసామాన్యం.

ఈలాగే సంఘం నిషేధించిన పనులు కొన్నిఉన్నవి. భార్యా భర్తలుకూడా పది మందిలో ఒకరి నొకరు ముద్దుపెట్టుకోవడం, సరసాలాడడం, మనసంఘం అంగీకరించదు. దీనికి విరుద్ధంగా ఎవరైనా నడుచుకొంటే వారిని సిగ్గులేనివారని మనం చెప్తుంటాం. 'సిగ్గు', 'లజ్జ' అన్నమాటలకు యిదే అర్థమని భాగవతంలోని ఒకానొకపద్యం చెప్తున్నది.

శుకుడు గోచియులేక పైజనజూచి తోయము లందుల
జ్జకు జలింపక చీర లొల్లక చల్లులాడెడు దేవక
న్యకలు హాశుకయంచు వెన్కజనంగ వ్యాసుని జూచి యం
శుకములన్ ధరియించి సిగ్గున స్రుక్కిరందఱు ధీనిధీ.

ఇట్టి సిగ్గుఉండుట అత్యవసరము. సాంఘిక మర్యాదలు సాంప్రదాయాలు నిలబడి వుండుటకు ఇదేకారణం. పిల్లలను శీలవంతులుగా చేయుటలో తల్లులు ఈవిషయమును మరువరాదు. సాంఘికమర్యాద లేవియో పిల్లలకు నేర్పవలసి యున్నది.

అయితే పిల్ల లనేకులు అనవరసంగా సిగ్గుపడు తుంటారు. అమితంగా జంకుతారు. దానిమూలంగా వారిశక్తి సామర్థ్యాలు వృద్ధికాకపోవడం, అడుగంటిపోవడం జరుగుతుంది. అట్టిది జరుగకుండా వారిని తర్ఫీదుచేయడంకూడా తల్లుల బాధ్యతయే.

మా పిల్లవాడు ఒంటరిగా ఉన్నప్పుడు బాగా ఆడుకొంటాడు. బొమ్మలతో మాట్లాడుతాడు. పాటలు పాడుతాడు. బహుసరదాగా ఉంటాడు. కాని నేనుగాని, ఇంట్లో మరెవరైనాగాని అతనికి కనుపిస్తే ఇవంతా మానుతాడు. అతనికి సహజమైన ధోరణినంతా మరచిపోతాడు. సిగ్గుచేత ఊరక ఉండిపోతాడు.

మా అమ్మాయిఉంది. అమితంగా మాటాడడం దానిస్వభావం. దానిమాటలు విసుకు విరామంలేదు. కోపగించినా మానదు. భయమన్నదిలేదు. కాని ఎవరైనా కొత్త వాళ్ళు ఇంటికివస్తేచాలు. అంతా మారిపోతుంది. నోరుమూసుకొని మరివిప్పదు. రాతి

బొమ్మలాగు నిలబడిపోతుంది. ఎంత బతిమాలినా ఒకమాటకూడా మాట్లాడదు. "బహు చమత్కారంగా మాట్లాడు తుందటగదా మీ అమ్మాయి. ఆమాటలను విందామని వచ్చాం." అని వాళ్ళంటారు. కాని లాభంఏమిటి? సిగ్గు మూలంగా వాళ్ళుఉన్నంతసేపూ గప్‌చిప్ మాట్లాడదు.

మాకు మరొక అమ్మాయి ఉన్నది. చాలాడబ్బు ఖర్చుపెట్టి సంగీతం చెప్పించాం. దానికంఠం చాలా బాగాఉంటుంది. బహుశ్రావ్యంగా పాడుతుంది. వీణ చక్కగా వాయిస్తుంది. కాని లాభంయేమిటి? దానికి అమితసిగ్గు. నలుగురిమధ్యన కూర్చుండి పాడమంటే ఏమీపాడలేదు. ఒకవేళ పాడినా ఒకటిపాడబోయి ఇంకొకటి పాడుతుంది.

ఇదంతా పిల్లలకు సహజం అంటారేమో? కాని, కానేరదు. మాఇంట్లో రెండేండ్ల పిల్లఉంది. ఎవరైనా క్రొత్తవాళ్ళు యింటికివస్తే వారి ముందుకువెళ్ళి కూర్చుంటుంది. ఎన్నాళ్ళనుండో వారితో పరిచయం ఉన్నట్లు ప్రవర్తిస్తుంది. ఆ పిల్లకు సిగ్గుగాని క్రొత్తగాని లేనేలేదు.

మరొకపిల్ల ఉంది. సాధారణంగా యింట్లోఉన్నప్పుడు స్తబ్ధులాగ ఉంటుంది. కాని ఎవరింటికైనా పేరంటానికిగాని, భోజనానికిగాని వెళ్ళినపుడు దాని నిజస్వభావం బయట పడుతుంది. పరాయిఇల్లే దానికి సొంతయిల్లుగా ఉంటుంది. అందరిదగ్గరకూవెళ్ళి కులాసాగా ఉన్నారాఅని వారి యోగక్షేమాలను కనుక్కొంటుంది. తాంబూలం ఇవ్వకపోయినా అడిగి పుచ్చుకొంటుంది. ఇంట్లోసిగ్గు, బయటసిగ్గు లేకపోవడం దానిస్వభావం.

అనవరసంగా సిగ్గుపడకుండా ఉండేటట్లున్నూ, సభా పిఱికితనంలేకుండా ఉండే టట్లున్ను మనం మన పిల్లలను తయారుచేయవలసి యున్నది. సిగ్గుఉండడం లేకపోవడం పుట్టుకతోవచ్చే గుణంకాదు. పిల్లలను చక్కగా పెంచినయెడల వారిశీలము మారగలదు అనే సిద్ధాంతం శాస్త్రపరిశోధకులు ఈ కాలంలో ప్రతిపాదిస్తున్నారు.

ఈ సిద్ధాంతము ననుసరించి తల్లులు తమ పిల్లలను పెంచినయెడల సిగ్గుపడవలసిన సమయములలోమాత్రం సిగ్గుపడుటయు, ఇతర సమయములలో సిగ్గుపడకుండా సహజ స్వభావమున కనుగుణముగ ప్రవర్తించుటయు జరుగును. ఈ విధముగ పిల్లలను పెంచు విధానమును తల్లులు నేర్చుకొనవలసి యున్నది.

(ఆలిండియా రేడియో అనుమతిని)

ఏకాంకిక :

# దత్తతా?

శ్రీ వోగేటి శివరామకృష్ణ శాస్త్రిగారు

(జూలై, 47, సంచిక తరువాయి)

3 వరంగము.

(రోహిణిప్రవేశము)

ఈవెంకాయమ్మగారుచాలమంచిది, ఈకొద్దికాలంలోనే నామనస్సును దగ్గరగానే లాక్కొన్నది. పూర్వులలోకూడా ఇల్లాంటివాళ్లువుంటారు కాబోలు! మేము ఆడిన నాటకమంతా అనవసరము లాగుంది. ఈమె తేలిగ్గా మావివాహాన్ని వొప్పుకునేలావుంది. చంద్రానికి పట్టి అధైర్యం. నోరువిప్పి చెప్పితే ఆవిడ ఏమనదు. ఆవిడ స్వభావం చాలా మెత్తనిది. పట్నాలకు గ్రామాలకు ఎంతవ్యత్యాసం; ఇక్కడ శాంతి ఎక్కువేమో అనిపిస్తుంది; కాని ఆకర్షణతక్కువ.

(ఇంతట్లో ఇంట్లోప్రవేశించిన కుక్కపిల్లనుచూచి) ఈచాదస్తం, ఇంట్లో కుక్కపిల్ల, ఏమిటో? బహుచిత్రంగావుంది.

(వెంకాయమ్మ ప్రవేశం)

వెంకాయమ్మ: ఏమే సీతా! వచ్చావూ (కుక్కపిల్లదగ్గరకువస్తుంది.)

రోహిణి: ఈకుక్కపిల్ల ఏమిటండీ?

వెంకాయమ్మ:— మాదొడ్లో ఒకమాయకుక్క దాన్ని కనివిడిచి ఎక్కడికోపోయింది. మళ్లీరాలేదు. దానికి యింట్లోమిగిలిన గంజినీళ్లు, ఆవీపోస్తూంటే మాయిల్లువదలటంలేదు. పాపం, దానికిమాత్రం ఎవరున్నారు? "ఇదంకాష్టం ఇదంకాష్టం నదీతీరేతి సంగమం"; అంతా ఋణానుబంధం.

రోహిణి:— ఇదేమిటా నిష్టపరుల యింట్లో కుక్కపిల్లవుందనుకుంటున్నాను.

వెంకాయమ్మ:— నిష్టఏమిటమ్మాయి; భూతదయ గొప్పదన్నారు శాస్త్రాల్లోకూడా, అడగడం మరిచాను, మీఅప్ప చెల్లెళ్లెందరూ?

రోహిణి:— నేనొకర్తనేనండి; అప్పచెల్లెళ్లూ, అన్నదమ్ములూ ఎవరూలేరు; నన్నైనా దొరికితే పెంచుకొంటున్నారు. — (నాలుక కరుచుకొనును.)

వెంకాయమ్మ — ఏమి శేమిటి??

రోహిణి.— ఏమిలేదు లెండి; అదొక కథలెండి.

వెంకాయమ్మ:—(చాలాఆతురతతో) అల్లాగనా; ఆకథ ఏమిటో చెబుదూ, కొంచెం.

రోహిణి:—(కొంతఅయిష్టతతో) వెనుక మానాన్నగారు రెవిన్యూ ఇనస్పెక్టరు చేసేరోజుల్లో ఎరుకలవాడొకడు నన్న ఏభైరూపాయలకమ్ముకున్నాట్ట.

వెంకాయమ్మ:—(కొంతఆవేదనతో) అదిగాదమ్మా; సరిగ్గా వివరంగాచెప్పు; నేనుకూడాఇల్లాంటి కథవొకటి ఎరుగుదును.

రోహిణి:— ఆవూరు ఒకడు ఒకబాల వితంతువును లేవతీసికొనివచ్చాడట; ఆమెగర్భవతి. ఆవూరి సత్రంలో పురుడువచ్చిందట; అల్లరిఅయితే, అవమానపడిపోతామని భయంతో వాళ్లు ఎరుకలవాణ్ణి పిలిచి, ఒకపాతిక రూపాయలిచ్చి, ఆశిశువును పారవేయమనిఇచ్చారుట; డబ్బుఆశతో ఈకిరాతక కృత్యానికి వొప్పుకొన్న ఎరుకలవాడు, అంతపని చేయలేక, పిల్లలు లేకపోవడం మూలాన పిల్లలకై తపించే మాఅమ్మకు ఏభై రూపాయిల కమ్ముకున్నాట్ట; ఇదంతా ఒకరహస్యకథ; మాచుట్టాలు కొందరు చెప్పుకుంటుంటే నేను రహస్యంగావిన్నాను.

వెంకాయమ్మ:—(ఆపుకోలేని దుఃఖంతో, సంతోషంతో) నిజంగానా, నిజంగానా, నాతల్లీ; ఈ నిర్భాగ్యురాలికి కూడా మాతృత్వం చూపించుకునేచోటువుందా; నాకళ్లు నేనే నమ్మలేకపోతున్నాను. అబ్బా, ఆఎరుకలవాడు నాచిన్నారిశిశువును తీసుకుపోతూంటే ఎల్లాబాధపడ్డాను; మెత్తని చేతుల్ని, ఆబోసి నవ్వుల్ని విడలేక, ఎంతక్షోభించి పోయాను, ప్రతినిత్యం జరిగే ఈసృష్టి కార్యాలకు,ఈ సంఘ మర్యాదలకు ఈవైరుధ్య మేమిటో, నాహృదయంలో నివురుగప్పిన నిప్పువలె నిరంతంమూడ్చి వేసేఈయగ్ని ఎల్లాభరించగలిగాను? నాతల్లీ, ఈకుక్కపిల్ల తల్లికోసం ఏడ్చేఏడుపు వింటూంటే నాహృదయం తరుక్కుపోతుంది,నీవెల్లా క్యారుమని,ఏడ్చిపోయావోకదా అనిపించేది. ఎదో, దత్తత తెచ్చి ముడిపెడితేమాత్రం రక్తంకలియనిప్రేమ, ఏమిప్రేమ? మేనల్లుణ్ణితెచ్చి ఆస్థిపరారీ అవుతుందని ముడిపెట్టారు కాని, ఎంతచేస్తే మాచంద్రం మీదప్రేమ తెచ్చిపెట్టుకున్నదే, నిన్ను చూసినప్పణ్ణించీ నాచిన్నతనం రూపంతో పోల్చుకుంటున్నాను; ఆవిశాలమైన కళ్లూ ఆపొడుగైన వుంగరాలజుట్టూ అచ్చంగా నావే, ఈకుక్కపిల్లకు గంజి పోసినప్పుడెల్లానీవు జ్ఞాపకం వచ్చి దహించివేశావు; నాతల్లీ—

(రోహిణిని గట్టిగాకావలించుకొనిఏడ్చును)

రోహిణి:— (ఆశ్చర్యపడి నివ్వెరపడిపోవును) అమ్మా, నానోట మాటరావడంలేదు? చంద్రం నన్నుపెళ్లిచేసుకున్నాడు? అన్నాచెల్లెళ్ల వివాహమా??

వెంకాయమ్మ:—నిజమేనా, ఒరేయ్, చంద్రం (చంద్రం ప్రవేశం)

ఏమిరా ఈమెను పెళ్లి చేసుకున్నట్లు చెప్పలేదేం?

చంద్రం:— (కొంచెంకంగారుపడి) అవునమ్మా, ఇంకెవర్నీ చేసుకోలేనమ్మా; రోహిణి ఎప్పుడూ చంద్రుని భార్యయే.

వెంకాయమ్మ:— (వెర్రినవ్వునవ్వి) దత్తత స్వీకారపత్రిక మూలమున కొడుకు కానివాడు కొడుకెట్లా అవుతాడు; హృదయం ఎరువిచ్చేదా; రక్తసంబంధంలేనిదే ప్రేమఎక్కడిది? నీవులోకం దృష్టిలో ఏమైనా, నాదృష్టిలో మాత్రం అల్లుడివే — మీరిద్దరూ సుఖంగా వుండండి.

(చంద్రం, రోహిణి చేతులుకలుపును)

# త్రి వే ణి

చిరంజీవి బృంద.

●

త్రివేణి చక్కనిచుక్క. మంచిగుణములుగలది. ఎప్పటికిని నవ్వుముఖముగలిగి ఏదో ఒక పాటపాడుకొంటూనే, అన్ని పనులు చేసేది. వేసరి అనేదే ఎఱుగదు. త్రివేణిని చూచిన అందరకు సంతోషమే. తండ్రి రామారావు - బడిపంతులు - ఎలిమెంటరీ స్కూలు మాష్టరు. ఇంక చెప్పాలనా, అతని సుఖ సంతోషాలు, భార్యాబిడ్డల సౌఖ్యాలు. సౌభాగ్యము లేదుగాని బహు సంతాన సంపన్నుడు. సప్తసంతానములు పుట్టినవి. ఏడుగురు ఆడుబిడ్డలే కావాలా వరుసగా! లక్ష్మి, సరస్వతి, సావిత్రి, గంగ, యమున, త్రివేణి, గోదావరి అన్నీ దేవతలపేర్లే. లక్ష్మిని ఒక స్కూలు మాష్టరుకు, సరస్వతిని ఒక జిన్నులోని గుమాస్తాకు, సావిత్రిని ఒక కరణముయ్యకు, గంగను ఒక పురోహిత చావస్తునకు, యమునను ఒక మోటారు డ్రైవరునకుఇచ్చి పెండ్లిచేసినాడు, రామారావు. ఇప్పుడువచ్చింది త్రివేణికి వంతు పెండ్లిది. పాపము తల్లి అనసూయాబాయి త్రివేణినైనా మేలురకము సంబంధానికిచ్చి పెండ్లిచేయాలనే ఆశతో బిడ్డనుపెంచింది, 18 ఏండ్లదాక. ఏమిలాభం? ఆ వరశుల్కాల మార్కెటురేట్లు మితిమించిన కాలమాయె. వేల పైగానేగా ఖరీదులు. తల్లిదండ్రులు సర్వనాశనమైతేనే బిడ్డలకు మొగుళ్లు దొరకడం. పాపికాలము! త్రివేణికి ఎంతచింత.

సరిపెండిండ్ల కమిషను ఏజెంటు శ్యామాచార్లు నేరుగా రామారావుఇంటికే వచ్చాడు. ఏకరువుపెట్టాడు తానేర్పరచిన వరునిసంగతంతా గ్రుక్కతిరుగకుండా. ఎవడావరుడు? కృష్ణప్పా కరణం. వయస్సు 48. రెండోపెండ్లి. భార్యబ్రతికేవుంది. ఇంట్లోనే వుంటుంది. పిల్లలు కాలేదటతనకు; గనుక మొగనికి ఇంకోపెండ్లి చేస్తూంది. తానేనిలచి. ఎంతత్యాగము! కమిషను ఏజెంటు ఆరితేరినవాడు. గ్రుడ్డివాండ్లకు, కుంటివాండ్లకు, అంగవిహీనుల కెందరికో పెండిండ్లు చేయించిన సమర్థుడు. ఎట్లనో ఒప్పించినాడు, రామారావును, ధనాశకల్పించి. ఇదే జ్యేష్ట బహుళపంచమి, ముహూర్తము నిశ్చయించాడు కూడాను.

రాట్నము త్రిప్పుచూ త్రివేణి అంతా వినుచున్నది. తండ్రి కసరుమనిషి. కోపిష్టుడు. ఎదురుపలికే త్రాణలేదు. ఏమీ పలికిందికాదు. పలుకులకు మారు ముత్యాలవంటి కన్నీటి చుక్కలు బొటబొట వ్రాలినవి ఎన్నో. బుధవారము పెండ్లిదినము. ఎమ్మిగనూరులోనే. మంగళవారమురాత్రి 4 కొట్టింది. లోకమే నిద్రలో మునిగింది. లేచింది త్రివేణి మెల్లగ.

చీకట్లోగుడికల్లు బాట పట్టింది. ఒక ఫర్లాంగునడక. కుక్కలు, నక్కలు అరస్తూనేయున్నవి. భయముతో కాళ్ళు తడబడుచూ, గుండెలు కొట్టుకొనుచుండ అటు ఇటు, ము దు వెనుక చూచుచూ దారి పట్టింది.

పెండ్లిదినము బుధవారము. పెండ్లికూతుర్ని చూడక అందరు ఎక్కడెక్కడని అనసాగిరి. ఎక్కడాలేదే. అందరు గందరగోళములో నున్నారు. గుండావాళ్ళ తోట బావిలో గుంపుగా జనులుమూగినారు. నిండుజవ్వనిది శవము; తేలాడుచున్నది. బయటికి తీసివుంచారు. ఆనవాలు పట్టారు. త్రివేణి. ఏమిలాభము. త్రివేణి ఎందుకూ త్యజించి బావిలోపడి మరణించింది? త్రివేణీ! నీకు నూరేండ్లునిండెనా! వృద్ధుని పెండ్లాడజాలక ఎంత సాహసానికి ఒడిగట్టితివి? నీవలె ఎందరు బీదకన్యలు ప్రాణత్యాగము చేసికొంటున్నారో, ఎవరుచెప్పగలరు? వరకట్న పిశాచానికి భయపడి, తలిదండ్రులు వెదికి వెదికి, ముసలి వాండ్లకే బిడ్డలనిచ్చి పెండ్లిండ్లుచేయ మొదలిడినపుడు స్వాతంత్రమెక్కడిది మూగకన్యలకు? చెప్పుకొన్నా వినువారెవ్వరు? పెద్దలు అరికట్టలేరూ, యీ దురాచారమును? బీదలకు గత్యంతరమేలేదా; గంగమ్మా నీవేదిక్కు!


# తలవెంట్రుకలను పెంచును



రీటా కుదుళ్లకు బలమునిచ్చి, నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్.

తలవెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేను కొరుకు, ఇంకను తలవెంట్రుకలకు సంబంధించిన సమస్త వ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేనకువేలు వాడి గుణమును పొంది యున్నారు. మీరుకూడ నేటినుండియే రీటా వాడుడు. రీటా హిందూ దేశమంతటా దొరకును.

వెల సీసా 15 అణాలు.




**RITA**
**HAIR TONIC**

# కాపుల సంభాషణ

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు. — లక్ష్మయ్య, సుబ్బయ్య, కోటయ్య.

లక్ష్మయ్య: (జండా భుజానపెట్టుకొని పోతూ ఉంటాడు.)

సుబ్బయ్య: (వెనుకనుంచివస్తూ) అరే! నీమచ్చుమాయ, లచ్చుమయ్యా! యాడకిరా, నామాలు, గీమాలు దిట్టంగా దిద్ది ఉరుక్కుంటూ పోతాఉండావు?

ల|| ఎక్కడ కంటావేంటి బాబాయి? ఈరోజున భారతస్వాతంత్ర్యోత్సవంగాదూ; ఆ ఉత్స వానికి పోతున్నా.

సు|| ఎక్కడ చేస్తున్నారురా ఉత్సవం?

ల|| ఎక్కడేమిటి; ఒకచోటనా. ఊరంతా, దేశమంతా, ప్రపంచమంతా, చేస్తున్నారు.

కోటయ్య: (ప్రవేశిస్తూ) ఏమిటిరా చేస్తున్నది?

ల|| ఎరగనట్టు ఏమిటంటావేమిటి? నీవందుకు గాదూ వస్తున్నది?

కో|| ఆఁ నాకదేపట్టింది. మా పడ్డదూడ యాడకోతప్పించుకపోతేను, దాన్ని వెతుక్కోడానికి పోతుండా. అయినా ఏమి సౌరాజ్యమోయ్, తింటానికి గింజలులేకపోయె; కట్టుకోడానికి గుడ్డలులేకపోయె, అన్నిటికీ కంటరోళ్లూ రేసనింగులుఆయె. దొంగనిలవలూ, అదికలాభాలు ఆయె. ఇట్లాంటి కాటకంరోజుల్లో ఎందుకొచ్చిన ఉత్సబాలు; ఎందుకొచ్చిన వూరేగింపులు!

సు|| అదేనయ్యా! నాకుపట్టిన సందేగమూను. ఆనాడేమో సౌరాజ్యమొస్తే దేశంలో పజంతా కూటికీ, గుడ్డకూ కరువులేకుండా లచ్చనంగా ఉంటారని లెగిచెర్లిచ్చారు, ఈనాడు చూడబోతే ఏమీ కనపడదు. అన్నిటికీ గిజగిజగానే ఉన్నది, మనగోడు ఆలించేవాడూ పాలించేవాడు కనపడలేదు.

ల|| అయితే అది స్వరాజ్యం వచ్చినందువల్ల నంటావా? యుద్ధం వచ్చినప్పటినుంచీ మనస్థితి యిట్లానే ఉన్నదిగా. అది స్వరాజ్యంమీద రుద్దుతావేం.

కో|| ఓ, ఆయుద్ధంపోయి రెండేండ్లాయెగా, అప్పటినుంచి లచ్చనంగా ఉండరాదూ.

ల|| ఎట్లా ఉంటాము? ప్రపంచ యుద్ధమాయెను, అన్నిదేశాలు దీనిలో చిక్కుకొని చితికిఉండె. మనకు పండేపంట మనకు చాలకపోయె. ఇతరదేశాలనుండి తెప్పించుకొందామంటే వాటి పంటలు వాటికేచాలక ఏడుస్తుండె. అయినా నానాదేశాలనుంచి దొరికిన గింజల్లా మన ప్రభుత్వంవారు తెప్పించి తిప్పలుపడుతునే ఉన్నారుగా?

కో|| ఆఁ ఆఁ చాలాతిప్పలు పడుతున్నారు. కాబట్టే పదహారుఔన్సులల్లా పన్నెండైంది, పదైంది, ఎనిమిదైంది, యింకా తగ్గుతుందేమో అనిగూడా అంటున్నారు. వాటిల్లోనూ కొన్ని బియ్యమూ, కొన్ని నూకలూ, కొన్నిజొన్నలూ, కొన్నిదుంపలూ, కాయలూనూ. ఈరిచ్చేరేసను

ఆడపిల్లలు గుజ్జెనగూళ్లు వండుకోడానికి సాలడంలేదు. ఏందిరా యీతిరిపెం? ఇదేనా సొరాజ్యం?

ల || చాలనప్పుడు సద్దుకోవద్దూ? ఎట్లామరి?

కో || ఏందిరా సరుదుకొనేది యిల్లోవాకిలో? అయినా ఒకనాటిదా; రోజూ సరుదుకుంటూ ఉంటే మనిసిలో జవసత్వాలేముంటాయి? ఇట్లా సరుదుకొని సద్దుకోని బతికితే ఆఖరుకు అసలుకే సద్దుకోవాలసివస్తుందేమో.

ల || మనకు ఆ అర్ధకూడైనా దొరుకుతున్నది సంతోషించు, అదీలేకగాదూ బెంగాలులో లక్షలాది జనం చచ్చారు?

కో || ఉన్నదంతా ఏదేశాలకో దోచుకొనిపోయి మిలటరోళ్లకు మేపితే, జనం సావకేమిచేస్తారు?

ల || ఇకమనకా కష్టాలుండవు, మన అన్నం మన బట్టా ముందుగా చూస్తారు, మనస్వరాజ్య ప్రభుత్వంవారు.

కో || ఒరే అసలు నీవు కాంగ్రెసుమనిషివీ చదుబుకున్నోడివీ, కాదూ. అన్నీ యిట్లాగే తియ్యంగా చెప్తావు కాని చూడబోతే ఏమీ ఉండదు. అయితే సరేగాని మనసొరాజ్యప్రభుత్వంవారు మనతెలుంగోళ్లకు పత్తేకరాష్ట్రం యివ్వమంటే యివ్వలేదుట సరిగదా ఒకగవనేరుపనిగాని ఒకమంత్రిపనిగాని ఏదీయివ్వలేదుటగా. ఆళ్లు మనందరినీ సిన్నసూపు సూస్తుంటే మనమెందుకు ఆరుచెప్పిన ఉత్సవాలు చెయ్యాలో చెప్పు.

ల || ఇదవరు చెప్పారు?

కో || మొన్నెవరో బజారులో ఉపన్యాసంలో సెబుతుంటె విన్నానులే. ఆమాట విన్నప్పటినుంచీ మనుసు తుకతుకా ఉడికిపోతున్నది. ఆళ్లు మనతెలుంగోళ్లమంచి సూడకుండా మనోళ్లను ఎక్కడా కాలెట్టనీయకుండా ఉంటే ఏందోయి వీరిమాటవినేది?

ల || వాళ్లెవరు? మనమెవరు? స్వరాజ్యమందరిదీకాదూ, నూరేళ్లనుంచీ పోరాడుతూఉంటే నేటికి స్వరాజ్యమంటూవస్తే మనలోమనం కలతలుపెట్టుకుని కూడిరాకపోవడమూ, వెనుకా ముందుగా అన్నీవస్తాయి.

ఆరిలాబాలు ఆరు సూసుకుంటూ మనతెలుంగోళ్లను ఎందునా చేరనీయకపోతే, మనకుమాత్రం గుబ్బుగాదుట్రా?

కో || అరేలచ్చుమయ్యా అడగమరిసిపోయినా, రాత్రిమాపిల్లగాడన్నాడూ ఆడదానికి గవనేరుపని యిచ్చారటేందిరా, దేశంలో మొగాళ్లు లేనట్టు.

ల || అవును యిచ్చారు. ఒకగవర్నరు పనేగాదు, మంత్రిపనీ. విదేశపు రాయబారపుపనీ, అన్నీ యిచ్చారు.

కో || ఆఁ ఆఁ అన్నీ ఆడవాళ్లకే, సొరాజ్యమంటే ఆడమళయాళమా ఏందిరా!

ల || స్వరాజ్యప్రభుత్వంలో స్త్రీపురుషులకు సమానహక్కులూ, హోదాలుయిచ్చారు, స్త్రీ అనే

కారణంచేత ఏ పనికీతగదని భావించరాదు, ఇవ్వమని నిరాకరించరాదు. మన స్వరాజ్య పోరాటంలో వాళ్లు సమానంగా పాల్గొని కష్టపడ్డవాళ్లేగా.

కో|| పడితేమటుకు అంత సరి సరి, మర్యాదలా? ఇంట్లోవాళ్లు మనతోబాటు కష్టపడుతుంటే సమానంగా చూస్తున్నామా.

సు|| అవునురా ఆడ, మగ, అన్నతర్వాత కాసంతసు కుడీ, యెడమా ఉండనక్కర్లేదా.

ల|| ఇక ఆ పప్పులుడకవు; వాళ్లూ తెలివినపడుతున్నారు.

కో|| సరే, పడరూ. మనమెతకనుబట్టే రౌతు మెత్తనైతే గుఱ్ఱం మూడుకాళ్లనడిసిందట!

సు|| అదిసరే గాని లచ్చుమయ్యా సాయిబులు మనలోనుండి యిడిపోయినా రంటున్నారేందిరా.

ల|| అవును.

కో|| ఏందీ, ఏందీ, తురకోరు మనలోనుంచి యిడిపోయినారూ, అళ్లు అందుకే గోలచేస్తున్నారని వింటున్నాంగా.

ల|| ఆ.

కో|| అయితే యింకేం సౌరాజ్యమోయ్.

ల|| విడిపోతేనేం నీతమ్ముడు నీలోంచి విడిపోలా.

కో|| విడిపోతేమాత్రం ఇంత గందరగోళాలా.

ల|| ఒక్క తల్లికడుపున బుట్టినాళ్లుగదా. అబ్బో మీరంతకీచులాడుకున్నారు? ఆరోజుల్లో మీయింట్లో ఎట్లాఉండేది, వేళకు అన్నాలున్నాయిగా?

కో|| అయితేనేం, మొన్ననాకు కాస్తవల్లతప్పిందంటే లగెత్తుకువచ్చాడు.

ల|| వీళ్లుమాత్రం?

సు|| అరేపిచ్చిలచ్చుమయ్యా వీళ్లుఅట్లా అపేక్షతో వస్తారంటరా, విడిపడి పోయాక.

ల|| మనమెప్పుడూ మంచినేకోరుదాం. ఐకమత్యమే ఆశిద్దాం, కలిసిరమ్మనే అడుగుదాం. ఆనక వారియిష్టం, అయినా అన్నదమ్ములు విడిబడిపోతే వేరు వేరుగా పండగలు చేసుకుంటారు గాని అసలు మానుకోరుగా. మనస్వరాజ్య ఉత్సవం మనమెందుకు మానుకోవాలి, వారు వేరుపడ్డారనేనా చెప్పు.

కో|| అయితే స్వరాజ్యఉత్సవం చేయవలసిందే నంటావు?

ల|| ఆహా! తప్పకుండా చెయ్యవలెనంటాను. వెయ్యేండ్లదాస్యం విచ్ఛిన్నమైపోతుంది. నూరేండ్ల యుద్ధం ఆరిపోతున్నది. సిపాయీల తిరుగుబాటుమొదలుకొనీ ఝాన్సిలక్ష్మీబాయి కాలం నుంచీ నేటివఱకు అవిచ్ఛిన్నంగా సాగుతున్న సమరంయిది. దాదాభాయినౌరోజీ, లోకమాన్య గంగాధరతిలక్, లాలా లజపత్రాయి. అజితసింగ్, మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజనదాస్, సేనుగుప్తా, డాక్టర్ అన్సారీ, మహాదేవ దేశాయ్, నాగేశ్వరరావు పంతులు, విఠల్ భాయి పటేల్, కస్తూరిబాయ్ గాంధి, మదనమోహన మాలవ్యా, ఒకరేమిటి ఎంతమంది ఈ మంచిమాట వినడానికి తపించి తపించి ప్రాణాలువిడిచారు? బోసుబాబు ఎంత ఆవేదనపడి

పరదేశాలపాలైనాడు. కుదీరాంబోస్, భగత్సింగ్, శుక్‌దేవ్, రాజగురు ఎందరు ఉరిస్తంభాలెక్కారు. ఈస్వరాజ్యంకోసం, అట్లావాళ్లు తపించి తపించి ప్రాణాలు ధారపోసిన స్వరాజ్యం నేడు వస్తూవుంటే మనం బ్రతికివుండి మీనమేషాలు లెక్కపెట్టుతూ స్వరాజ్యోత్సవంలో పాల్గొనకపోవడమా? ఏమి సబబయ్యాయిది.

సు॥ అవును నీవు చెప్పినమాటలు, నిజమేగాని యింకా తెల్లదొరల ఆధిపత్యం పూర్తిగాపోలేదంటారేమిటి, నిజమేనా ?

ల॥ ఈ శంకలకేమి బాబాయి. మనసభలుచేసిన తీర్మానాలే చట్టాలవుతున్నాయి, మనవాళ్లే గవర్నర్లు, మనవాళ్లే మంత్రులు, మనవాడే ప్రెసిడెంటు, సైన్యంమనది, ఖజానామనది, వ్యాపారంమనది, ఈరోజు గవర్నరుజనరల్ మౌంటుబాటెన్, మనస్వరాజ్యజెండాలకు తలవంచి మీప్రభుత్వానికి విధేయుడనంటున్నాడు, ఇంకా ఏంకావాలి? బ్రిటిషువాళ్లతో ఏదో సంబంధమంటున్నావు అదీ. ఎప్పుడు మనం కాదంటే అప్పుడుపోయేదేకాని బాధించేదికాదు. ఇంతైనతరువాత యిక స్వరాజ్యఉత్సవం చేసుకోడానికి ఎందుకు సంకోచించాలె. వెనుదీయాలె. అందుకే యీ స్వాతంత్ర్యోత్సవం అందరు శ్రద్ధతో, భక్తితో, ఉత్సాహంతో ఐకమత్యంతో చేయవలెనని నా అభిప్రాయం, ఏమంటారు?

సు॥ అరే నీవు చెప్పినమాటలువింటే స్వరాజ్యఉత్సవం అందరు చేయాలనిపిస్తున్నదిరా.

శో॥ నాకు అట్లాగే తోస్తావున్నది.

ల॥ అయితే రండిపోదాం స్వతంత్ర భారతికీజయ్ !

మహాత్మాగాంధీకీ జయ్.



స్వ తం త్ర దే శ ము
సం తో షిం ప గ
స్వ తం త్ర సం చి క
స క ల గృ హం బు ల
ప్ర కా శ మొ ద వ గ
ప్ర చా ర మొ స గి న
కృ పా శా లి ని వి
గృ హ ల క్ష్మి!

డా॥ పోలాకి శ్రీనివాసరావు.

# అనాథ శిశు శరణాలయములు

"లోకములన్నియుఁ గడియలోన జయించినవాడ వింద్రియానీకముఁ గెలువనేరవు" అని ప్రహ్లాదుడు తండ్రి హిరణ్యకశ్యపు నధిక్షేపించియుండెను. "విద్వాంసునిగూడ లాంగదీయునవి ఇంద్రియములు" అని ఋషివాక్కు. పరాశర, విశ్వామిత్ర, నారదాది ఋషివర్యులును ఇంద్రియచాపల్యమునకు కొండొకకాలమైనను తల ఒగ్గినవారే. ఇక సామాన్యజనులమాట చెప్పవలయునా? అట్టి ఇంద్రియచాపల్యమును స్వేచ్ఛావర్తనమున తీర్చుకొన్న స్త్రీపురుషులలో—పురుషుడు కఠినహృదయుడై—పేచీపూచీలేకుండా తిరుగనేర్చునుగాని స్త్రీ అవస్థ అట్టిదికాదు. ప్రకృతి మరీవంచింపదలచెనేని ఆస్త్రీ దురవస్థ చెప్పతరముగాదు. ఏ తత్ఫలితముగూపుదాల్చి, గర్భమునుండి వెలుపల పడుటే ఒకగండము; ఆ పిదప మరీ గండకత్తెర! అదితప్పని తలంచిరా, సంఘమర్యాద నతిక్రమించిన తప్పు—ఆ స్త్రీపురుషులది గాని—రక్తపుముద్దయైన ఆశిశువుదికాదుకదా. ఆశిశువు—ఇతరములగు అందరి శిశువులవలెనే—బ్రతికిబట్టగట్టిబుద్ధులునేర్చి ఏదేనివృత్తినవలంబించి జీవయాత్రనడుపుటకు సంపూర్ణమైన హక్కుగలవి యగుచున్నది. ఆ తల్లియు చేసిన తప్పుచాలక మరియొక తప్పును చేయనవసరములేకుండా—తనశిశువు నొక సురక్షితస్థలమున చేర్చవలయునని అలమటించును.

అయితే సంఘమున అట్టి అవకాశము లుండవలయును. ప్రభుత్వమున్నూ, అందును ముఖ్యముగా ప్రజాప్రభుత్వములున్నూ, అందుకు సహాయపడవలయును. హిందూధర్మమున్నూ ఇందుకు వ్యతిరేకముగాదు. శ్రుతిస్మృతులు వివాహధర్మములను మంచి కట్టుబాట్లలోనుంచిన మాటమాత్రము వాస్తవమే. అయితే ఇంద్రియచాపల్యమున సంఘమున వ్యక్తులు పొరబడుతారని వారూహింపకపోలేదు. అట్లేర్పడిన సంతానమునకు సంఘమున స్థానము కల్పింపకపోలేదు. పుత్రులు ద్వాదశ విధములన్నారు. వానిలో ఔరస, క్షేత్రజ, దౌహిత్ర, దత్తకాది ధర్మసుతులనేగాక—కృత్రిమ, గూఢజ, అపవిద్ధ, సహోఢ, పౌనర్భవ, కానీనాదులను చేర్చినారు. అట్టి సంతానవంతులగు స్త్రీలను చేబట్టినవారు

వారిని పుత్రవతు ఆదరించెడివారని దానియర్థము. భీష్ముడంపశయ్యపైనుండి, యుద్ధమునకు తరలిపోవుచు నమస్కరింపవచ్చిన కర్ణునికి ఏకాంతమున "నీవు రాధేయుడవు కాదు; కానీనుడగు 'కౌంతేయుడవు' కావున 'పాండవుడవు' అని చెప్పినాడు. భీష్మునికన్న ధర్మాధర్మవేది కలడా? పౌనర్భవ, కానీనాది సంతానములను ఏసంబంధములేని—కరుణార్ద్రహృదయులు సంరక్షించిన గాథలు పురాణములలో పెక్కులు. సంతానవిహీనులైన రాధాసూతులు, కర్ణుని పోషించి, పెంచుట గొప్పకాదు. జనకునివంటి విరాగికూడ, నాగేటిచాలున దొరికిన సీతను పుత్రికగా పెంచినాడు. జనాపవాదమునకు వెరచి శ్రీరాముడును అడవుల విడచిన గర్భిణిని, సీతను, గంగలో కలియనున్నదాని, తెచ్చి తన యాశ్రమమున ప్రసవింప ననువు కల్పించి, ఆమెను, ఆమెపుత్రులను కాపాడినాడు వాల్మీకిమహర్షి; శకుంత సంతాన పరిరక్షితమైయున్న కసిగందును తెచ్చి సాకినాడు కణ్వమహర్షి. ద్వీపమధ్యమున పరాశరుడు గన్న పసిబాలుడు ఎవ్వరు ఆదరింపకయే—వేదవ్యాసుడైనాడా? కృపియు, కృపాచార్యులు నట్టివారే! అనగా మహాఋషులున్నూ ఇట్టి సంతానపరిరక్షణము నొక్క పవిత్ర ధర్మముగా భావించిరన్నమాట.

నేటికాలమున ఇట్టి మహనీయులు లేకపోలేదు. కీ॥ శే॥ రఘుపతి వెంకరత్నం నాయుడుగా రిట్టి శిశువులను పుత్రికలవలె పెంచి కీర్తిగన్నారు. ఆ మధ్య 1940 సం॥న గుంటూరున శివాలయమున నెలల కసుగందును, బాలికను, ఎవ్వరో విడిచి—శారదా నికేతనమువారు స్వాధీనపరచుకోవలసినదని, చీటీనుంచగా ఉన్నవదంపతులు గొనివచ్చి ఆ బాలికను రక్షించిరి. ఆ బాలిక పోషణార్థము మా సంపాదకులు శ్రీ కేసరిగారు సాలీనా రు. 100 ల నొసంగి ధన్యులైరి.

అయితే నవనీతహృదయులు కరుణార్ద్రచేతస్కులై తటస్థపడినప్పుడిట్టి ఉత్తమకార్యమొనర్చుటచాలదు. వీరి నా అభాగ్యులు వెతకి కనుగొనుటయు సులభసాధ్యముకాదు. కావున—దక్షులైనవారిట్టి వారి నాదరించి ప్రయోజకుల నొనర్చి సంఘమున గౌరవ ప్రపత్తులతో జీవయాత్ర నడుపగలవారినిగా విడువగల సంస్థలను—అనాథ శిశు శరణాలయముల నేర్పరుపవలయును. తమ ఆర్తనాదము వినినంతనే—తామెవ్వరో తెలియకుండనే, తెలుసుకోవలెననే యుబలాటమైన లేకుండగానే,—తమ శిశువుల స్వీకరింపగల ఏర్పాట్లను ఆ అభాగినులు కోరుదురు. ఇట్టి దాంధ్రదేశమున నొక్క పీఠికాపురాధీశ్వరులు నిర్వహించుచున్నారు. మద్రాసున కంపెనీ రోజులనుండియు నొక ఆంగ్లో ఇండియన్ ఆర్ఫనేజి

నడుచుచున్నది. ఒకముస్లిం శిశుశరణాలయము నిటీవల ఏర్పడినది. సంఘనీతి ఘనీభవించి,—మూఢాచార భూయిష్ఠమైన ఒక్క హిందూజాతి సంజాతులకే అట్లాంటిది మద్రాసుపట్నములోనైనా లేదు. ఈ మాసారంభమున తిరుచునాపల్లిలో మద్రాసు రాష్ట్రమంత్రి శ్రీ మాధవమీనన్‌గారు అట్టి అనాథశిశుశరణాయములు నెలకొల్పబడునేని ఒక్కొక్క శిశువునకు ప్రభుత్వము రు. 10-0-0 విరాళమిచ్చునని ప్రకటించినారు. వెంటనే అచ్చట శ్రీనివాసయ్యంగారను మహనీయు లాసదవకాశమును వృధచేయక తాము 200 బాలురతో నొక శరణాలయము నెలకొల్పుదుము అన్నారు. ఇంకను పలువురు ప్రముఖులిట్టి పనిబూనుదురుగాక యని గోరుదుము.

అయితే, "అతి సర్వత్ర వర్జయేత్" అన్నవాక్యము బాగా గమనించదగును. మరి ఈశరణాలయములలో బాలబాలికల నుభయులచేర్చుకొనవలయును. సామాన్యముగా నిట్టి అభాగినులను మాతులు వక్రించియు, ముక్కులు విరిచియు, వీధినిపెట్టి అల్లరిచేయువారు సాటి సోదరీమణులే హెచ్చుఅని—మేమన్నచో క్షమింతురుగాక. వారి గౌరవ రక్షణము పురుషులకన్నను తమకే ఎక్కువగ అవశ్యకర్తవ్యమనియు గృహలక్ష్ములు తలంతురుగాక. ఇట్టి శరణాలయముల నిర్వహణము గొప్పయింటి ఇల్లాండ్రు పూనుట సకల శ్రేయోదాయకమని మా అభిప్రాయము.



# దాంపత్యము

వాక్కు నర్థంబు, రసము భావంబు వోలెఁ,
జంద్రుఁడును జంద్రికయుఁ బోలెఁ, జగముతల్లి
దండ్రియును బోలెఁ, బూవును దావి వోలె,
బాగుగ నవినాభావ సంబంధమునను
బరిఢ విల్లంగవలయు దాంపత్య మెపుడు

వి. విమలాదేవి.

# కుష్ఠు ★ బొల్లి

## గ్యారంటీ చికిత్స!

తూర్పుఆఫ్రికా - దక్షిణాఫ్రికా - సిలోన్ - బర్మా - సయాం - మలయా - సింగపూర్ - ఫిజీ మొదలగు దేశములలో ప్రఖ్యాతిగాంచి వాడబడుచున్నవి మా ఔషధరాజములే!!!

### ఆఫ్రికా

జాన్ కొల్లాకో. డార్. ఎస్. - సలాం

C/o పో. పో. 86 డార్ యెస్ సలాం. 2-8-1944

సంవత్సరంక్రింద మీరు పంపిన మందు నాకు బాగా పనిచేసినదని మీకు తెలుపుచున్నాను.

మీకు మణియార్డరుద్వారా పంపిన రు. 56/-లకు మీ మందును పంపగలందులకు మిక్కిలి కోరుచున్నాను.

మీ విశ్వాసపాత్రుడు.

(సం) జే. కొల్లాకో

కేటలాగు ఉచితము.

## రెడ్డి & కో.,

(రిజిస్టర్డు)

H. O. గోపాలపురం, (వయా) తణుకు,
తూర్పు గోదావరిజిల్లా

★ బ్రాంచి ఆఫీసులు:— ★

బెజవాడ — గాంధినగరం

వాల్తేరు — R S. పోస్టు

సికింద్రాబాద్ — 3560. కింగ్స్‌వే

కటక్ — బక్సీబజార్

నెల్లూరు — కాపువీధి

ఫజిల్‌నగర్ — గోరక్‌పూర్ U. P.

# ఆగస్టు 15 స్వాతంత్ర్యోత్సవములు

ఆగస్టు 15న స్వాతంత్ర్యోత్సవాలు ఆంధ్రదేశమంతటా వైభవంగా జరిగినవి. అందులో పురుషులతో పాటు స్త్రీలు హెచ్చుగా పాల్గొన్నారు.

## కేసరీకుటీరం

కేసరికుటీరం భవనంమీద పెద్ద జాతీయపతాక మెత్తబడినది. భవనమంతా చక్కగా జాతీయపతాకాలతో అలంకరింపబడినది. కేసరీకుటీరం, గృహలక్ష్మిపత్రిక, లోధ్రముద్రణాలయములలోని సిబ్బందినంతా చుట్టూ కూర్చోబెట్టుకొని - కేసరికుటీరాధిపతులు శ్రీ కేసరిగారు ఫోటో తీయించుకున్నారు.

## కేసరీ హైస్కూలు

కేసరీ హైస్కూలులో పతాకోత్సవమును శ్రీ కేసరిగారే సల్పిరి. ఆ సందర్భమున శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారు, మైదవోలు శేషాచలపతి పంతులుగారు (స్కూలు కమిటీ అధ్యక్షు, కార్యదర్శులు) శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు మాట్లాడిరి జయజయ ధ్వానములు, ఆటపాటలు జరుగుచుండగా స్కూలు పిల్లలకు పెప్పరమెంట్లు పంచబడెను.

ఇంకను ఈ స్వతంత్రోత్సవము చాల జయప్రదముగా జరిగినట్లు వివరములతో, మా కార్యాలయమునకు వార్తలు పలుతావులనుండి అందినవి. అందు కొన్ని:—తూర్పు గోదావరిజిల్లా కోనసీమయందలి పేరూరుగ్రామము, ఉన్నతపాఠశాలా తెలుగుపండితులు శ్రీ వేదుల సత్యనారాయణగారు రచించిన "పతాకగీతము" ఉజ్వలముగానున్నది.

కడపలో జరిగిన యుత్సవసందర్భమున శ్రీ యస్. యన్. రామస్వామి బి. ఏ. బి. ఎల్ అడ్వొకేటుగారు కొన్నిపద్యములను పాటలను రచించి సభాస్థలిలో చదివినారు.

నర్సారావుపేటలో "స్త్రీ విద్యాభివర్ధనీ సమాజము"న శ్రీమతి బా॥ కృష్ణవేణమ్మగారు పతాకోత్సవంచేశారు. పలువురు స్త్రీలు సమయోచితంగా ఉపన్యాసాలిచ్చారు. రాట్నంవడకడం పోటీజరిగింది. పిల్లలకు మిఠాయిలు పంచిపెట్టారు—అని ఆ సమాజం కార్యదర్శిని శ్రీమతి వే. సీతామహాలక్ష్మమ్మగారు వ్రాశారు.

## తాజా వార్త

శ్రీమతి దిగుమర్తి జానకీబాయిగారు విశాఖపట్నం మునిసిపాలిటీకి కాంగ్రెసుతరఫున నిలువగా, పోటీలేకుండా ఎన్నుకోబడ్డారు.





ధర పాకెట్టు 1 కి॥ 0-12-0.

ఏమి, చాలా అందముగా ఉన్నావే?

ఆ! అవును. అదే మీరుతెచ్చిన కాటుకవలెనే ప్రాచీనకాలపు పద్ధతిప్రకారము తయారుచేయబడిన కాటుక 'ఐ-టచ్' కంటి కాటుక, నేత్రములకు చల్లతనము, కనుబొమ్మలకు అందము రెప్పలకు సొగసు కలిగించును. నేత్రవ్యాధులన్నియు నశించును

వేణుకా, కెమికల్సు వారివల్ల తయారుచేయబడినది. అన్నిషాపులలోను దొరకును. ఏజంట్లు కావలయును

దొరకుచోటు: 45, తాయారు సాహెబు వీధి,
2-వ నెంబరు సందు, మౌంటురోడు, మద్రాసు.

# స్వాతంత్ర్యసంచికా సందేశాలు

## ఆలశ్యంగా చేరినవి

[స్వాతంత్ర్య సంచికను ఉద్దేశించి పంపిన సందేశాలు ప్రముఖులవే కొన్నిమాకు ఆలశ్యంగా చేరడం చేత సకాలంలో ప్రచురింపలేకపోయినాము. వాటిలో ముఖ్యవాక్యాలు క్లుప్తంగా ఇస్తాము. గృ॥ సం॥]

### శ్రీ వల్లభాయి పటేల్ - కేంద్రప్రభుత్వపు హోం శాఖామంత్రి

... ... మనకు నేడు లభ్యమైన స్వాతంత్ర్యము మనము దేనికైతే కృషిచేశామో అదికాదని అంగీకరింపవలసియున్నా, భవిష్యద్భారత దేశమును మనయిష్టానుసారము రూపురేఖలు తీర్చి దిద్దడానికి నేడు అడ్డుపడేదేమిన్నీలేదు ... ... ఈ ఉత్సవ సమయంలో - స్వాతంత్ర్యముతోపాటు మనకు సంప్రాప్తమైన బ్రహ్మాండమైన బాధ్యతలను మరువరాదు. ... ... ...

### శ్రీ గోవింద వల్లభపంతు, యు. పి. రాష్ట్రప్రధాని

మనమొక విలక్షణమైన మార్గాన స్వాతంత్ర్యం సంపాందించాము. 40 కోట్ల జనానికి స్వాతంత్ర్యము అంటే ప్రపంచచరిత్రలో కనీ వినని మాట. తేజోవంతము, విజ్ఞానయుతము అయిన ఈ పురాతనదేశగౌరవమునకు తగినట్లు నడుచుకుందాము.

### శ్రీ వేముల కూర్మయ్యగారు, మద్రాసు ప్రచారశాఖా మంత్రి

అస్పృశ్యతను హిందూసంఘమునుండి రూపుమాపదలంచిన స్త్రీలు నడుము కట్టుకోవలయును, స్త్రీలద్వారానే అస్పృశ్యత నశించవలయును. మీ 'గృహలక్ష్మి' ఇందుకు కంకణం ధరించవలెను.

### శ్రీమతి బొనిలీఖాంగ్‌మన్, అస్సాం అసెంబ్లీ డిప్యూటీ స్పీకర్

ప్రపంచ చరిత్రలో ఇట్టి దివ్యసంభవమునుచూచే భాగ్యముగన్నాము ... ... నూతన భారతదేశ నిర్మాణము మనతలపైనున్నది. మన ప్రియమైన దేశభవిష్యత్తును నిర్మించుటలో భారతస్త్రీలను - మన భాగము నెరవేర్చవలసియున్నది.

### శ్రీమతి అల్లాడి వెంకటలక్ష్మమ్మగారు

అహింసావ్రతము నవలంబించిన మనగాంధీ మహాత్ముని కోరికప్రకారము యుద్ధములు లేకుండా శాంతిమార్గముననే స్వరాజ్యము వచ్చినది. మిక్కిలి గర్వింపదగిన విషయము. భారతస్త్రీలు తాము అబలలమని తలచక పురుషులతోపాటు కష్టపడి పనిచేసి దేశమునకై పాటుపడవలెను. ఇట్లుచేయుటలో తాము గృహలక్ష్ములమగుట మరువక గృహకృత్యములను బాగుగ నవరింపుచు దేశకార్యములను చేయవలెను.

ఈ సందర్భములో వనితాలోకపు సేవకై ప్రయాసపడు "గృహలక్ష్మి" మాసపంచికనుగురించి కొన్నిమాటలు చెప్పుట ఉచితమని తోచుచున్నది. ఆంగ్లభాషకు ప్రాముఖ్యతకలిగియున్న ఈ ఇరువది సంవత్సరములలోకూడ, మాతృభాషాభివృద్ధికని ఈ మాసపత్రిక మిక్కిలి పాటుపడినది.

నేటి స్వాతంత్ర్యముచే మాతృభాషలకు మరల ప్రాముఖ్యత రానున్నది. ఇట్టి తరుణమున "గృహలక్ష్మి" ఆంధ్రనారీమణుల సేవకనియు, ఆంధ్రభాషాభివృద్ధికనియు పూర్వముకన్న నెక్కువగ పాటుపడునని నమ్ముచున్నాను.

# ★ స్వీకారము ★



## జై హింద్ :

తెలుగు వారపత్రిక తెనాలినుండి ప్రచురణజరుగుచున్నది. సంపాదకులు శ్రీమంతెన వెంకట్రాజుగారు ఎం. ఎల్. ఏ. ఈ పత్రిక ప్రత్యేకలక్షణము ప్రకాశంగారు వారిబృందము - "ఆంధ్రులకన్యాయం జరిగింది; కుట్రచేసి తను మంత్రిత్వము కూలద్రోశారు" అని చేసేప్రచారానికి ప్రతిగా వ్రాయడం. దీని అవసరానవసరముల నిర్ణయించుకోవడం పత్రికాసంపాదకుల ఇష్టాయిష్టము; పాఠకుల అభిరుచి. అయితే తాత్కాలిక ప్రయోజనముకలదే: నేడు స్వాతంత్ర్యం సంప్రాప్తించింది. దానిని నిర్వహించడానికి సుస్థిర రాజకీయపక్షములేర్పడవలెను. అందుకు పత్రికలు తోడ్పడవలెను. అయితే ఈ పత్రిక వెక్కసంగాగావించే బ్రాహ్మణదూషణ తగ్గించకపోతే ఆపని నెరవేర్పజాలదుఅని మావిశ్వాసం. పత్రిక చిరస్థాయి అగుగాక.

## అజద్ హింద్ :

కడపలో శ్రీవై. ఆదినారాయరెడ్డిగారి సంపాదకత్వమున వెలువడుచున్న వారపత్రిక. వీరిఆశయం "లభించిన స్వతంత్రం అందరికీ అందుబాటులో ఉండేటట్టుగాచేయాలి" అని. ఇందుకనుగుణ్యంగానే ఉన్నాయి ఇందు వ్యాసాలు. పత్రిక చిరకాలంనడిచి రాయలసీమలో పత్రికలు క్లుప్తమనేలోటు తీర్చుగాక.

## Andhra Herald (ఆంధ్రా హెరాల్డ్)

సంపాదకులు శ్రీ వైద్యుల రమణరావు బి. ఎ. గారు. ఇది ఆంగ్ల వారపత్రిక, ఆంధ్రుల బాగోగులు చూడడానికి ఏర్పడ్డదట. శ్రీ ప్రకాశం పంతులుగారికి తీరని అన్యాయం జరిగిందని గాఢంగా చింతించునీపత్రిక, అంతటితో ఆగక - ఇతర ఆంధ్రసమస్యలనుకూడా ఈపత్రిక - విమర్శించుచు, మన దౌర్భాగ్యానికి ఇతరుల తెలివితేటల కలిమియేగాక, మనవారికవిలేమికూడా కారణమని ఈ పత్రిక ఊహించి - ఆంధ్రుల స్వశక్తి విజృంభణకు దోహదమిస్తే కృతకృత్యఅవుతుంది. రమణరావుగారివంటి అనుభవపరులైన సంపాదకుల చేతిక్రింద ఆపని అవశ్యం అవుతుందిఅని మానమ్మకం. సం॥ చందా రు 10 లు. విడిపత్రిక 0-3-0 దొరుకుచోటు 4 స్ట్రింగర్ స్ట్రీట్, జి. టి. మద్రాసు.


## గోల్డన్ బంగారు నగలు.



మునుపటివెల రు 10-0 0 ఇప్పటి సగంధర రు. 5-8-0

ఈ చిత్రములలో కనబడు 3 ఆభరణములు వున్నవి. అన్ని మతముల వారు వుపయోగించవచ్చును. స్త్రీలుచూచినఎడల బహుసంతోషపడుదురు. బంగారునగలవలె ప్రతిదినము వుపయోగించ వచ్చును. కొంతకాలము వరకు ఈ ధరకు ఇవ్వబడును.

నగల వివరం: 1 జత గాజులు, 1 జత సినిమా స్టార్ కొత్తరకం లోలకులు, ఒక నెక్‌లెస్ అను చైను (కంఠహారము)

పెట్టెతో ధర రూ. 5-8-0 తపాల ఖర్చు 0-8-0.

B. J. GOKHALE, General Merchant, 260, Esplanade, Madras 1.

# పల్నాటియుద్ధం

## ఫిలింవిమర్శ

శారదా ప్రొడక్షన్స్‌వారి పల్నాటియుద్ధం అనేఫిల్మును 7-9-47 తేదిన ప్రభాత్ టాకీస్‌యందు శ్రీ గౌ. రాజమన్నార్‌గారి అధ్యక్షతక్రింద 'ప్రెస్‌షో'గా చూపించినారు. ఆంధ్రులచరిత్రకు సంబంధించి-ఆంధ్రంలో తీయబడిన మొదటి ఫిల్ము ఇదే - దీనినిగూర్చి కలలుగని, కష్టించి ఫిల్ముతీయుట ప్రారంభించిన కీ॥ శే॥ గూడవల్లి రామబ్రహ్మంగారు మధ్యలో కీర్తిశేషులగుట విషాదకరము. ఆ విషాదోదంతమును ప్రప్రథమంలో చూపించినారు. అది యెంతో సమంజసము. ఫిలిం అంతా ఎంతో హృద్యమంగా ఉన్నది. 800 సం॥లనాటి ఆంధ్రమహాపురుషులు పలునాటివీరులు ఎదుట మొలిచి నిలిచి వ్యవహరిస్తున్నట్లుగా ఉన్నది. శ్రీ డా. గోవిందరాజుల సుబ్బారావుగారి 'బ్రహ్మయ్యనాయుని' వేసము, నటన రాజమన్నార్‌గారన్నట్లు బ్రహ్మయ్యగారిట్లాగే ఉండేవారు కాబోలన్నట్లున్నవి. గాంభీర్యమైనమూర్తి; ఆ మూర్తి సంచాలనంలో ఎంతవేగమో అంత స్థిమితం; గజబృంహితంలాంటి వాక్కు; తగినవేసం, బాస - అన్నిటా 'బ్రహ్మయ్య' మూడుమూర్తులా మలిచినట్లు, మొలిచినట్లుఉన్నారు. అన్నిటికి మించిన విశేష మింకొకటున్నది. సుబ్బారావు గారి కంఠస్వరంలో సహజంగానే గాంభీర్యముతో పాటు విషాద మొలికించే జీర ఒకటున్నది. అది వివేకాన్ని తెలిపేదిగాని, దైన్యంలో పుట్టినదికాదు. బ్రహ్మయ్యకా, ఉభయపక్షాలు తానుపెంచి పెద్ద చేసినవారు; ఒకవేపు అసమర్థుడైన నలగాముడు, ఆశపోతు నరసింగు, వారిని పిట్టలనుచేసి ఆడించేనాగమ్మ; నాగమ్మకు తనంటే వల్లమాలిన ఈర్ష్య, ద్వేషము, వాటిని చక్కగా తీర్చుకోడానికి చక్కని అవకాశం, సామర్థ్యం ఆమెకున్నాయి. మలిదేవాదులు తన్నే నమ్ముకున్నారు. కొమ్మన్నబావ "చిత్తం, శబాస్"లు తప్ప రెండో యోచన చెప్పనెరుగడు. (ఇందుకు గిడుగు శీతాపతిగా రెంతైనా ఒప్పినారు.) అనుగురాజు బుద్ధి ఒకచోట, మనసొకచోట. కన్నమనీడు, బాలచంద్రులు 'ఉరుకు' 'నరుకు' - అనే మాటలేగాని ఒండెరుగని ఉడుకు పిండాలు! అందరూ తన్ను దేవునిగాభావించి - ఆలోచన అంతా తనకే వదలినారు. తానా మూర్తీభవించిన శౌర్యప్రతాపాలు; కరుడుగట్టిన రాజనీతి; ఉభయపక్షాలస్థితి, శాంతిగోరే - నవనీత హృదయం; అవలంబించిందా - భక్తిభావపూరితమైన వైష్ణవమతము; నారసాలు గ్రుచ్చుకొని, గండకత్తెరలు వేసుకొనే పాషండమతం, వీరశైవంకాదు. అందుచేత శ్రీ డా. సుబ్బారావుగారి మూర్తి, గమనం, కంఠస్వరం ఆ వేసానికమర్చినట్లు హత్తుకోగా- రాణించింది; ఫిల్ముకే అది సొంపు తెచ్చింది. నాయకురాలు వేసిన కన్నాంబ పౌరుష ప్రాధాన్యమైన వేసాలకమరిన విగ్రహం. చాకచక్యంలోకూడా తీసిపోదు. అయితే ఆమె ఆద్యంతమూ, ఎప్పుడూ చిటపడువేస్తే పుట్టెడు పేలాలయ్యేట్టు ధుమధుమలాడే మొగంలో చిటపటలాడటం కన్నాంబ కందమిచ్చింది గాని నాయకురాలిని పూర్తిగా రూపించలేదు. స్త్రీ, అందులో మంత్రాంగంచేసే స్త్రీ, తేనెపూసిన కత్తిని శత్రువులచేతనాకించే నేర్పు. నయము మాటలులో, చర్యలలో చూపించవలె - కవి, దర్శకుడు నటి, వీరిలో ఎవరి లోపమైనా, అది లోపమే. అనుగురాజును నర్తకిచేత చంపించడంకన్నా మరొక సున్నితమార్గంవెతికితే బాగుండేది. ఆ నర్తకిచేత 'శివదీక్షాపరురాలినిరా' అన్నపదము పాడించినట్లైతే స్వారస్యంగా ఉండేది. బాలచంద్రుని శృంగారరంగము టూకీగా జరుపవలసి వచ్చింది. అందుచేత స్వారస్యం ఇంకింది. యుద్ధరంగం అద్భుతంగా చూపబడ్డాది. దాన్ని చూస్తుంటే ప్రతిఆంధ్రుని వళ్లు పులకరించకమానదు. అంత్యం ఆదర్శప్రాయం. గుణాలతోపాటు లోపాలులేకపోతే మానవసృష్టే కాదు. అందుచేత గుణాలనేయెంచి ఆంధ్రులు విరివిగా ఈ ఫిల్ముచూచి ఆనందిస్తారని భావిస్తాను.

# ఆలిండియా రేడియో—మదరాసు

●

1947 సెప్టెంబరుమాసపు మహిళల కార్యక్రమాలు.

మంగళవారం ౧౬ వ తేదీ లాలిపాట - కోమలం - సఫలమాతృత్వము - మనస్తత్వము - పరిసరాలు-ప్రసంగము. ఈజిప్టు సంగీతము-రికార్డ్. మేలుకొన్న ఆసియా - ఈజిప్ట్. మంగళం.

లక్ష్మివారం ౧౮ ,, వినాయకునివలెను - వాద్యసమ్మేళన. నీలాపనింద - రూపకము. గోటు వాద్యము.

లక్ష్మివారం ౧౮ ,, వినాయకచతుర్థి-ప్రసంగము. మంగళము.

శనివారం ౨౦ ,, మబ్బుకన్నె - మలయపవనుడు - యుగళగీతి. పెంచుకోడము సరదాలు - కుక్క. అంతాచిన్మయము - తత్వము. వంట ఇంటి విజ్ఞానము - తాలింపులు వేయింపులు. ప్రసంగము - వచ్చేవారపు విశేషాలు. మంగళము.

మంగళవారం ౨౩ ,, ఏల వీతురమ్మ - స్థానం - రికార్డ్. రంగస్థలములో స్త్రీల పాత్రలు - స్థానంవారి సత్యభామ - ప్రసంగము. లావాక్కింతయు - రికార్డ్. మీరు చదివారా? - గజేంద్రమోక్షము మంగళం.

లక్ష్మివారం ౨౫ ,, పదిదానమిచ్చితే - వాద్యసమ్మేళనం - ఇల్లాలికి ఇది తగదు - ఖర్చుదారితనము - ప్రసంగము. దర్బారు - వాద్య చిత్రము ఆరోగ్యప్రసంశ - ఊపిరితిత్తుల జబ్బులు: ప్రసంగము, మంగళము.

శనివారం ౨౭ ,, నమశ్శివాయతే - అధ్యాత్మకీర్తన తారాపథము - పరిచయము, లవకుశ జననం - పాటకథ. మహిళాలోకము. వచ్చేవారపు విశేషాలు. మంగళం.

మంగళవారం ౩౦ ,, అనగనగ - గృహప్రవేశము - టాకీగీతము - రికార్డ్. పిల్లల పెంపకములో - గుట్టు, దాపరికము - ప్రసంగము. నావికా యుగళగీతము. మేలుకొన్న ఆసియా - మలయా - ప్రసంగము, జనగనమన - కోరస్ - రికార్డ్.

1947 అక్టోబరుమాసపు మహిళల కార్యక్రమాలు.

లక్ష్మివారం ౨ వ తేదీ వరములొసగి, కీరవాణి - వాద్యగోష్టి, మన కెంతవరకు అవసరము? - ఆంగ్లవిద్య, సంభాషణ. ఆరోగ్యపరిసంశ - దంతముల శుభ్రిత - ప్రసంగం మంగళం.

శనివారం ౪ ,, తవవిరహే వనమాలి - అష్టపది-ఛాయామూర్తి - రూపకం జానపదగీతం - మాయలోకం చిత్రమునుంచి - రికార్డ్. పెరటితోట-మాలిని సలహాలు-వచ్చేవారపువిశేషాలు మంగళం.

మంగళవారం ౭ ,, కోపమేల రాధా - యుగళగీతం - రికార్డ్. కుటుంబములో పరస్పరము - తోడికోడళ్లు - ప్రసంగం. ఫ్లూట్ - గౌరీ మనోహరి - మీరు చదివేరా? - భమిడిపాటివారి "ఎప్పుడూ ఇంతే" ప్రసంగం. మంగళం.

లక్ష్మివారం ౯ ,, నిన్నుజూచి - సౌరాష్ట్రం - వాద్యగోష్టి స్త్రీకి శెలవులు? చీకటుల పాలేనా - భావగీతము - వేదుల రచన - సౌందర్య పోషణ-ముఖవర్చస్సు-పసుపా? పౌడరా? ప్రసంగం. మంగళం.

శనివారం ౧౧ ,, కృష్ణలీలాతరంగము పిల్లల ఆటలు - తల్లుల బాధ్యత-గోళ్లశుభ్రిత-ప్రసంగము. ఊడుపుల పాట - జానపదగీతము-మహిళాలోకము-వచ్చేవారపు విశేషాలు మంగళం.

మంగళవారం ౧౪ ,, నీతోడు ఉంటాను - యుగళగీతము. కుటుంబములో పరస్పరము-ఆడబడుచు - ప్రసంగం. గోటువాద్యము - మోక్షముగలదా-రికార్డు - ప్రపంచ విషయాలు. మంగళం!